అపరాధ పరిశోధన అనుబంధం—145

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అమావాస్య రాత్రి

రచన: బొమ్మిడి అచ్చారావు

## పైచేయి

రచన : వసుంధర

## మరణభీతి

రచన : సుంకరి రాంప్రసాద్

అపరాధ పరిశోధన సప్లిమెంట్—145
జనవరి, 1986
వెల: రు. 6-50
ఏడాది చందా: 78 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
శ్యాంబాబు
ఏ. ఏ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# అమావాస్య రాత్రి

## బొమ్మిడి అచ్చారావు

"ఈ రెండు రోజులుగా మీ అన్నయ్య ఎక్కడున్నారో తెలీదు. కాస్త వాళ్ళ ఆఫీసుకి వెళ్ళి కనుక్కో కేశవా!" అన్నది రాధ.

కేశవ్ వదినగారివైపు చూడకుండానే, "ఏదైనా ఆఫీస్ పనిమీద వెళ్ళాడేమో వదినా! అప్పుడప్పుడు యిలా వెళ్ళటం అన్నయ్యకలవాటే కదా!" అన్నాడు.

రాధ అతనిలా తేలిగ్గా తీసుకోలేదా విషయాన్ని. "నాకు చెప్పకుండా కాంప్ వెళ్ళరు. కనీసం ఆఫీస్ అటెండర్‌తోనైనా కబురు చేస్తారు. గుడ్డలు తీసుకు వెళ్తారు. కాంప్ కాదని ఖచ్చితంగా చెప్పగలను" అన్నది.

కేశవ్ ఓ రెండు క్షణాలేదో ఆలోచించుకుని "సరే, వాళ్ళ ఆఫీసుకి వెళ్ళి వస్తాను. నువ్వనవసరంగా వర్రీ కావద్దు వదినా!" అన్నాడు.

ఓ గంట తర్వాత తిరిగొచ్చి, "అన్నయ్య రెండు రోజులుగా ఆఫీస్‌కి రావటం లేదని చెప్పారండినా

అన్నయ్య కోలీగ్స్!" అన్నాడు కేశవ్.

రాధ భ్రాన్తపడిపోయింది. కొద్దిక్షణాలవరకు తేరుకో లేకపోయింది.

"ఏమిటి కేశవా....అయితే, రెండు రోజుల్నుంచి ఆయన ఎక్కడికి వెళ్ళినట్టు?"

"అదే నాకూ అర్థం కావటంలేదు వదినా! వాళ్ళు చెప్పిన వెంటనే పరుగెత్తుకొచ్చాను. అన్నయ్య యేనాడూ యిలా చేయలేదు. నిన్న ఉదయం ఆఫీసుకి బయల్దేరిన వ్యక్తి ఆఫీసుకి కూడా వెళ్ళకుండా యెక్కడికి వెళ్ళాడో, యీ రోజు వరకు యింకా ఎందుకు రాలేదో అంతుబట్టకుండా వున్నది" అన్నాడు కేశవ్.

రాధ విచారవదనంతో, "ఆయన స్నేహితుల్ని ఎంక్వయిరీ చెయ్యకపోయావా? అసలు నిన్నట్నుంచీ నిన్ను వెళ్ళి రమ్మంటుంటే వెళ్ళావే కాదు!" నిష్ఠూరం, బాధ కలగలిపిన గొంతుతో అన్నది.

"అనుకోని కేంప్ మీద వెళ్ళివుంటాడనుకున్నాను. అందుకే యిప్పటిదాకా యెదురుచూశాను. నువ్వు భయ పడటం చూసి వెళ్ళా నాఫీసుకి. నీ అనుమానమే నిజ మయింది. అన్నయ్య నిన్న ఆఫీసుకసలు వెళ్ళనేలేదంటే, ఏదో బలమైన కారణముండి వుండాలి."

"అంత బలమైన కారణమేమిటో తెలుసుకోవద్దా?.. కొంపదీసి యేదయినా ఏక్సిడెంట్" రాధ గొంతు వణికింది దుఃఖంతో.

"అబ్బెబ్బె...అలాంటిదేం లేదు వదినా! ఈ మూడు నాలుగురోజులుగా సిటీలో ఏక్సిడెంట్ ఏమీ జరగలేదు. అలాంటిదేమైనా వుంటే లోకల్ పేపర్లో వెంటనే వచ్చేస్తూంది. పైగా నిన్న ఉదయమనగా వెళ్ళా

డన్నయ్యా!..” ఓదార్పుగా అన్నాడేగాని మనసులో ఏదో అనుమానం పీకుతోంది కేశవ్ కి.

వారం రోజులుగా తన అన్న జయరాం యేదో మానసికమైన అశాంతికి లోనైనట్టు కేశవ్ గమనించాడు. కాని అన్నను ఆ విషయమై ఏమీ అడగలేదు. కుటుంబ సమస్యలో, మరేదైనా ఆఫీసు వ్యవహారమో అతన్ని సతమతపెడుతూ వుండొచ్చునని, ఆ విషయానికంత ప్రాధాన్యత నివ్వలేదు కేశవ్.

ఇప్పుడు అన్నయ్య అంతర్ధానానికి, ఆ మానసిక అల జడికి యేదైనా సంబంధమున్నదా అని ఆలోచించాడు.

వదిన బాగా కంగారుపడిపోతోంది ఆమెకు అన్న య్యంటే గొప్ప ప్రేమ, ఆరాధన, అంతకుమించిన గౌర వాభిమానాలు వుండటంవల్ల అతనికి తలనొప్పి వచ్చినా, తనకు పెద్ద జబ్బు చేసినట్టు హడావిడి చేసేస్తుంది. అంతా చిన్నపిల్లల మన స్తత్వం. అన్నయ్యకు ఒక్కడే కొడుకు. ఆరేళ్ళ కుమార్ కాన్వెంట్ లో చదువుకొంటు న్నాడు. ఆ తర్వాత ఆమెకు సంతానంలేదు. అందుకనే నేమో అన్నయ్యపట్ల మరీ ప్రేమాభిమానాలు యెక్కు వయిపోయాయి.

“అన్నయ్య స్నేహితుడొకాయన నాకు బాగా తెలుసు వదినా! ఆయున్ని కనుక్కొని వస్తాను” అని బయల్దేరాడు కేశవ్.

రాబోతున్న కన్నీటిని బలవంతాన అదిమిపెట్టి తలూ పింది రాధ.

కేశవ్ చెప్పిన స్నేహితుడు కరుణాకర్. అతను వెళ్ళే సరికి బయటకు యెక్కడికో వెళ్ళటానికి తయారవు తున్నాడు.

కేశవ్‌ని చూసి పలకరింపుగా నవ్వి, "ఏమోయ్, రా, రా! మీ అన్నయ్య గురించి యేమయినా తెలిసిందా?" అనడిగాడు.

కేశవ్ అంతక్రితం ఆఫీసుకి వచ్చి జయరాం గురించి అడిగినప్పుడు కరుణాకర్ కూడా వున్నాడక్కడ. ఆఫీసు క్లోజింగ్ అవర్లో వెళ్ళాడు కేశవ్. అప్పుడు కరుణాకర్‌ని వివరాలు అడగలేదు. కబురందజేయ్యాలనే హడావిడిలో వదిన దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు.

"ఆ విషయమే మిమ్మల్నడగటానికొచ్చానండి. అన్నయ్యకి మీరు క్లోజ్ ఫ్రెండ్ కదా! మీకైతే పూర్తి వివరాలు తెలుస్తాయని వచ్చాను. వదిన బాగా ఆందోళన పడిపోతోంది. అసలు అన్నయ్య మీతో యేమైనా చెప్పాడా?"

"ఏమీ చెప్పలేదు. అదే ఆశ్చర్యంగా వుంది. మొన్న అంటే సోమవారం సాయంత్రం ఆరుగంటలు దాటే వరకు ఆఫీసులోనే వున్నాం మేమిద్దరం. మీ అన్నయ్య మామూలుగానే ప్రవర్తించాడు. నాతో సాధారణంగా అన్ని విషయాలు చర్చిస్తాడు. ఏదయినా ప్రత్యేకమయిన సమస్య వుంటే చెప్పి వుండేవాడు."

"నిన్న ఉదయం పదిగంటలకు మామూలుగానే బయల్దేరాడండి ఆఫీసుకు. మరి యింతలోనే ఏమయిపోయాడంటారు?"

"నిన్న ఆఫీసుకి మాత్రం రాలేదు. ఖచ్చితంగా చెప్పగలను. ఎందుకో సెలవు పెట్టి వుంటాడనుకున్నాం. కాని ఈ రోజు కూడా రాకపోయేసరికి మా మేనేజర్ని అడిగాను. సెలవు పెట్టలేదని తెలిసింది. సాయంత్రం మీ యింటికొద్దామనుకుంటుండగా ఆఫీసుకి నువ్వే వచ్చావు."

కేశవ్ అయోమయంగా చూశాడు కరుణాకర్ వంక.
"అయితే, అన్నయ్య అమాంతం తెలుసుకుని అవకాశమే లేదంటారా?" అన్నాడు.

"అదే ఆలోచిస్తున్నాను. ఒకలాగా అయ్యే అవకాశముంది...." అన్నాడు కరుణాకర్ సాలోచనగా.

కేశవ్ అలాగా చూశాడతనివంక.

"మరేంలేదు. మీ అన్నయ్య సిద్ధుణ్ణి కల్సుకోవటానికిగాని వెళ్లాడేమోననుకుంటున్నాను" అన్నాడు కరుణాకర్.

కేశవ్ విస్తుపోయి, "సిద్ధుడా? అతనెవరు?" అన్నాడు.

"పరిస్థితి ఇంతవరకు వచ్చాక నీకు చెప్పకపోవటం భావ్యంకాదు. మీ అన్నయ్యకి సాధ్య డబ్బు మీద వ్యామోహం పెరిగిపోయింది. కష్టపడనవసరంలేకుండా తేలిగ్గా డబ్బు చేసుకోవటంమీద దృష్టి కేంద్రీకరించాడు. అందుకు నిత్యానందస్వామి అనే సిద్ధుడే కారణం!" అన్నాడు కరుణాకర్.

"ఎవరా నిత్యానందస్వామి? అభ్యంతరం లేకపోతే వివరాలు చెప్పండి" అన్నాడు కేశవ్.

## 2

జయరాంకి వచ్చే ఆదాయం తక్కువ. ఖర్చులు యెక్కువ. అది అతను చేసుకున్న ఖరీదైన అలవాట్లవల్ల పెరిగాయి.

ఆదాయాన్ని ఖర్చుకి తగ్గట్టు పెంచుకోవాలనే తపనలో అతనికి యెవరో సలహా యిచ్చారు, రాగిని బంగారంగా మార్చే ప్రక్రియ తెలిసిన వ్యక్తి రాజమండ్రి ఆడవుల్లో వున్నాడని, అతను రాగిని బంగారంగా

మార్చే మూలికలు గురించి బాగా తెలిసినవాడనీ.

జయరాం వెంటనే రాజవోమ్మంగి వెళ్లాడు.

అది బాగా అడవి ప్రాంతం. అయితే యీ మధ్యనే నాగరికత ఆ అడవి పొలిమేరల్లోకి ప్రవేశించి, గిరిజన కోపరేటివ్ స్టోర్స్ పెట్టుకునేవరకు వచ్చింది. అంతక్రితం ఏజెన్సీ సరుకులన్నీ గిరిజనలు గోకవరం సంతలో అమ్ముకుంటుండేవారు. ఇప్పటికీ సగానికిపైగా అటవీ సంపద గోకవరంలో అమ్మకానికొస్తూంటుంది. దళారులు కొని మారు బేరాలకి అమ్ముతుంటారు.

జయరాం తనకి వివరాలు చెప్పిన గిరిజన వ్యక్తిని తన వెంట రాజవోమ్మంగి తీసుకువెళ్లాడు. అడవి ప్రాంత మంతా ఆ వ్యక్తి చాలా సేపు తిప్పాడు జయరాంని. చివరికి బాగా కీకారణ్యంలో వున్న జనసంచారం లేని ఓ చీకటి కోణం దగ్గరకు తీసుకువెళ్ళాడు. అక్కడ వరసగా అయిదారు కొండగుహాలున్నాయి.

ఓ కొండ గుహమాత్రం మనుషులు సంచరిస్తూన్న సూచనలతో కనిపించింది. ఆ వ్యక్తి జయరాంని ఆ కొండ గుహాలోపలికి తీసుకువెళ్ళాడు.

అంతదాకా యెంతో ధైర్యంగా వచ్చిన జయరాంకి ఆ నిర్జన కీకారణ్యం, భయంకరమైన నిశ్శబ్దం, మారు మూల చీకటి గుహాలు చూశాక ధైర్యం సడలిపోవటం మొదలయింది. వెనక్కి తిరిగి వెళ్ళిపోవాలని మనసులో చాలాసార్లు అనుకున్నాడు. కాని, బంగారంమీది ఆశ అతన్ని ముందుకే నెట్టింది.

గుహాలోపల అతి తక్కువ కాంతిలో ఓ చమురుదీపం వెలుగుతోంది. ఆ వెలుగ్లో ఓ ఎత్తయిన బండరాతిమీద పులిచర్మం ఆసనంగా కూచుని వున్న ఓ ముదుసలి కనిపిం

చాడు జయరాంకి.

అతని గడ్డం, మీసాలు, జుట్టు ముగ్గుబుట్టలా తెల్లగా వున్నాయి. కళ్ళు మూసుకుని ధ్యానముద్రలో వున్నట్టుగా వున్నాడతను.

జయరాం, అతన్ని తీసుకొచ్చిన గిరిజన యువకుడు ఆ వ్యక్తి కళ్ళు తెరిచేవరకు అక్కడే మౌనంగా నిల్చుని వుండిపోయారు. పదినిమిషాల తర్వాత అతను కళ్ళు తెరిచి, యెదురుగా వినయంగా నించుని వున్న గిరిజన యువకుణ్ని జయరాంని చూశాడు.

"ఎవరు నాయనా నువ్వు?" అనడిగాడు.

గిరిజన యువకుడు మోకరిల్లి, "అయ్యోర్యా, తమ దరిసెనాని కొచ్చిండు దొర. నేనే తోల్కొని వొచ్చిన" అన్నాడు.

"కూచో నాయనా! ఏమిటి నువ్వొచ్చిన పని?" అనడిగాడు ముసలాయన.

"స్వామీ, తమరు సిద్ధపురుషులని, నిత్యానంద స్వాములని యీ యువకుడివల్ల తెలుసుకున్నాను. తమరు బంగారాన్ని రాగినుంచి సృష్టిస్తారని, అందుకు కొన్ని వన మూలికల్ని ఉపయోగిస్తారని వాటి విషయం మీకు తప్ప మరెవ్వరికీ తెలియదనీ యీ కుర్రవాడు చెప్పగా విని తమ దర్శనార్థం వచ్చాను. నేను ఆర్థికపరమైన యిబ్బందుల్లో వున్నాను. తమరు అనుగ్రహిస్తే నా యిబ్బందులన్నీ తీరిపోతాయి" అన్నాడు జయరాం వినయంగా.

నిత్యానందస్వామిగా పరిచయమైన ఆ సిద్ధుడు మందహాసం చేస్తూ, పొడవాటి గడ్డాన్ని నిమురుకుంటూ, "ఎందుకు నాయనా, నీకీ ఆరాటం? ఉన్నదాంతో తృప్తి పడలేవా?" అన్నాడు.

"వాళ్లొచ్చే జీతం యే మూలకూ సరిపోవటంలేదు స్వామీ! అందుకే తమ దగ్గరకు వచ్చాను. నేను డబ్బు సమస్యల్లోపడి కొట్టుకుంటున్నాను. నన్ను వారించకండి స్వామీ!"

"అయితే, ఆ వనమూలికలు ఎక్కడ దొరుకుతాయో, వాటినెలా ఉపయోగించాలో అన్నీ వివరంగా చెపుతాను అమావాస్య రోజున తప్ప అవి కంటికి కనిపించవు. నువ్వు వచ్చే చతుర్దశి రోజున ఓసారి వచ్చి కనిపించు. అమావాస్య రోజున జరగవలసిన తంతు కొంత వున్నది. ఆ వివరాలు చతుర్దశిరోజున చెపుతాను."

జయరాంకి ఆనందంతో వెంటనే నోటమాటరాలేదు.

"అలాగే స్వామీ! ఈరోజు ద్వాదశి. ఎల్లుండే కదా చతుర్దశి. తప్పక తమ దర్శనం చేసుకుంటాను" అన్నాడు.

"చతుర్దశి రోజున పగటిపూట మాత్రమే రా! ఈ రోజు ఆదివారం. మంచిరోజున నన్ను వచ్చి కలిశావు. మంగళవారం చతుర్దశిరోజు. అదికూడా మంచిరోజు. వెళ్ళిరా!" అన్నాడు సిద్ధుడు.

"మహాప్రసాదం స్వామీ! ఆజ్ఞ యిప్పించండి."

"వెళ్ళిరా, నాయనా!" అన్నాడు సిద్ధుడు.

జయరాం, తనకి గైడ్‌లా వ్యవహరించిన ఆ గిరిజన యువకుడి సహాయంతో అడవినుంచి బయటికొచ్చాడు.

## 3

కరుణాకర్ చెప్పింది సంభ్రమాశ్చర్యాలతో విన్నాడు కేశవ్.

"అయితే...నిన్న మంగళవారం, తిథి చతుర్దశి ఏమో శాస్త్రి కేలండర్ చూసి చెప్పండి" అన్నాడు.

ఆతనిలో ఆత్రుత అధికమయ్యింది. బంగారం

మోజులోపడి అన్నయ్య ఏదో క్రూరకలయంలో చిక్కుకున్నాడనిపిస్తోందతనికి.

కరుణాకర్ కేలండర్ చూసి "కరక్టే! ఈ రోజు అమావాస్య. అందుకనే మీ అన్నయ్య వెళ్ళివుంటాడు, అనుమానంలేదు. ఆదివారం రాజవొమ్మంగి వెళ్ళివచ్చాడు. సోమవారం నాకు ఆఫీసులో యీ సంగతి చెప్పాడు. నేను కొట్టిపారేశాను. 'అదంతా ఉత్తది, ఎవడో నిన్ను వెర్రిబాగులవాడ్ని చేసి ఆడిస్తున్నాడు. రాగిలో బంగారం చేయుట మేమిటి? నీకీ మూఢనమ్మకాలెలా వంటబట్టాయి?' అని కేకలేశాను.

మీ అన్నయ్య తన పట్టు వదల్లేదు. అలాంటి పిచ్చి ఆలోచనల్తో మనసు పాడుచేసుకోకు అంటూ హెచ్చరించాను. సోమవారం ఆరుగంటలవరకు మా మధ్య ఇదే చర్చనీయాంశమయింది. నిన్న ఉదయం నించే కదా జయరాం కనపడటంలేదు!? ఖచ్చితంగా రాజవొమ్మంగి వెళ్ళివుంటాడు" అన్నాడు.

కేశవ్‌లో ఉద్వేగం, అసహనం చోటుచేసుకున్నాయి "అయితే, యిప్పుడెలా? అన్నయ్యకేదైనా ఆపద సంభవిస్తే....?" అన్నాడు భయంగా.

"అదే, నేనూ ఆలోచిస్తూన్నాను.... సరే, ఓ పని చేద్దాం. మనం వెంటనే రాజవొమ్మంగి వెళ్దాం. అక్కడ మీ అన్నయ్య ఆచూకీ తెలియవచ్చు. అమావాస్య యీ రోజే కదా! అక్కడ ఏదో తంతువుందన్నాడు. మరి అదెలాంటి తంతో? కనీసం, ఆఫీసుకి సెలవుకూడా పెట్టకుండా వెళ్ళిపోయాడంటే, ఉద్యోగంపట్లకూడా అతనికి శ్రద్ధపోయింది. బంగారం వచ్చిపడుతుంటే, జీతం రాళ్ళతో పనేమిటనుకుని వుంటాడు.

నువ్వు మీ యింటి దగ్గరే వుండు. ఓ అరగంటలో వెనొస్తాను. ఎనిమిది గంటలకి రాజమండ్రి పోయే బస్ వుంది. ఇప్పుడు ఏడుగంటలవుతోందికదా, దొరుకుతుంది” అన్నాడు కరుణాకర్.

కేశవ్ ఇల్లు చేరేసరికి రాధ ఆత్రుతగా అతనికోసమే నిరీక్షిస్తూ గడపలోనే నించుంది.

“బాబూ, కేశవా, మీ అన్నయ్య ఏం చేశారో తెలుసా?” అన్నది ఉద్వేగంతో కూడిన దుఃఖంతో.

“ఏం చేశాడు వదినా?” కేశవ్ గుండె దడదడా కొట్టుకోసాగింది.

“మధ్యాహ్నం మన కుమార్ కాన్వెంటుకి వెళ్ళి కుమార్‌ని తీసుకొని వెళ్ళారట. అంత అర్జంటుగా యెక్కడికి వెళ్లారో, మళ్ళీ అంత అర్జంటుగానూ వచ్చి కుమార్‌ని తీసుకుని యెక్కడికి తీసుకెళ్ళిపోయారో నాకేమీ అర్థంకావటంలేదు. ఇంటికూడా రాకుండా ఆయనిలా ఎందుకు ప్రవర్తిస్తున్నారో నాకేమీ బోధపడటంలేదు. జ్వరం వచ్చినట్టుగా వుంది. ఏమిటో అయిపోతున్నట్టు ఏదో జరగకూడనిది జరిగిపోతున్నట్టు నా మనసు కీడు శంకిస్తోంది” ఆమె తూలిపడిపోబోయి అంతలోనే నిలదొక్కుకున్నది.

“వదినా, అప్‌సెట్ కావొద్దు. అలా కూచో. అసలేం జరిగిందో చెప్పు! అన్నయ్య కుమార్ కాన్వెంటుకి వెళ్ళటమేమిటి, కుమార్‌ని తీసుకెళ్ళటమేమిటి? ఎవరు చెప్పారీ విషయం?”

“ఎవరో కాదు, కుమార్ క్లాస్ టీచరే! స్కూల్ అయిపోయాక ఆమె కుమార్‌ని వాళ్ళింటికి తీసుకుపోయి ప్రతి సాయంత్రం ట్యూషన్ చెప్తూందికదా! ఈ రోజు

కూడా అలాగే కుమార్ ని తీసుకువెళ్ళి వుంటుంది, కుమార్‌తో వస్తూందని యెదురు చూస్తున్నాను. నువ్వు మీ అన్నయ్య ఫ్రెండ్ దగ్గరకు వెళ్ళిన వెంటనే ఆ టీచర్ ఒక్కతే వచ్చింది. కుమార్ ఏడని అడిగాను.

ఆమె నిర్ఘాంతపోయి,

"మధ్యాహ్నం వాళ్ళ డాడీ వచ్చి తీసుకువెళ్ళారు కదండీ! పుస్తకాలు క్లాసులోనే వుండిపోయాయి, ఇచ్చి పోదామని వచ్చాను. కుమార్‌ని వాళ్ళ నాన్నగారింకా యింటికి తీసుకురాలేదా?" అనడిగింది. నా గుండెలు చల్లబడిపోయాయి. ఆమెకేదో సమాధానం చెప్పి పంపేసి నీకోసం ఎదురుచూస్తున్నాను" అన్నది రాధ ఆయాసపడుతూ.

కేశవ్ నిర్ఘాంతపోయాడు.

అన్నయ్య నిన్న ఉదయం అడవికి వెళ్ళి యీరోజు మళ్ళీ యిక్కడకు వచ్చాడు. కుమార్‌ని ఎందుకు తీసుకు వెళ్ళినట్టు? మాటమాత్రంగానైనా వదినతోగాని, తనతో గాని అసలు సంగతి ఎందుకు చెప్పలేదు? ఊళ్ళోకి వచ్చి కూడా యింటికెందుకు రాలేదు, అసలు కుమార్‌ని ఎక్కడకు తీసుకువెళ్ళాడు?

అన్నీ ప్రశ్నలే! సమాధానాలు ఊహించటానికి కూడా భయంగా వుంది కేశవ్‌కి.

సరిగ్గా అప్పుడే కరుణాకర్ తయారై వచ్చాడు. కేశవ్ చెప్పింది విని, చేష్టలుడిగినట్టు నిల్చుండిపోయాడు.

కొద్దిక్షణాల తర్వాత తేరుకొని, "కేశవ్, వెంటనే రాజవోమ్మంగి వెళ్ళాలి. మీ అన్నయ్య కుమార్‌ని అక్కడికే తీసుకువెళ్ళి వుంటాడు" అన్నాడు కరుణాకర్.

రాధ అయోమయంగా చూసింది వాళ్ళిద్దరి వంక. కరుణాకర్ వంక చూసి, "ఏమిటి మీరు చెప్తున్నది? రాజవొమ్మంగి యేమిటి, కుమార్ని అక్కడికి తీసుకు వెళ్ళట మేమిటి? దయచేసి వివరంగా చెప్పండి. నా గుండె ఆగిపోయేలా వుంది. ఒకేసారి తండ్రీ కొడుకు లిద్దరూ మాయమయ్యారు. తట్టుకోలేకపోతున్నాను" అన్నది బేలగా.

"వదినా, ధైర్యం తెచ్చుకో! నేను కరుణాకర్ గారు అన్నయ్యను వెతకటానికి వెళ్తున్నాం. నేను బహుశా రాత్రికి రాను. ఒకటి రెండు రోజులు పట్టినా పట్టొచ్చు తిరిగి రావటానికి. నువ్వేం కంగారుపడొద్దు అన్నయ్యను తీసుకొని వస్తాను. కుమార్, అన్నయ్య క్షేమంగా తిరి గొస్తారు. నువ్వు భోంచేసి నిద్రపో! తలుపులు జాగ్రత్తగా వేసుకో!" అంటూ ధైర్యం చెప్పాడు రాధకి.

"భోంచేసి వెళ్ళు" అన్నది గొంతు పెకల్చుకుని ఎలాగో.

"బస్ వెళ్ళిపోతుంది. వెళ్తున్నాం" అంటూ హడా విడిగా కరుణాకర్తో బయల్దేరాడు కేశవ్.

# 4

"వచ్చావా, నాయనా? ఇలా కూచో! ఈ రోజు చతుర్దశి మంగళవారం. నీ సంకల్పానికి దృఢత్వం కలి గించే రోజు. ఈ రోజెందుకు రమ్మన్నానో తెలుసా?" అడిగాడు సిద్ధుడు జయరాం వంక నవ్వుతూ చూసి.

"చెప్పండి స్వామీ!" అన్నాడు వినమ్రంగా.

"చూడు నాయనా, యీ బంగారం సృష్టికి చాలా వ్యయప్రయాసలకి ఓర్చాలి. చాలా శ్రమతో కూడిన సాధన చెయ్యాలి. నీకు సమ్మతమేనా?"

"సమ్మతమే స్వామీ సెలవివ్వండి."

"అన్నట్టు అడగటం మరిచాను. నువ్వు సంతానవంతుడివే కదా! నిస్సంతుడివి కాదు గదా!"

"సంతానవంతుడ్నే స్వామీ! ఆరేళ్ళకొడుకున్నాడు."

"భేష్! నీ తపస్సుకు పరిపూర్ణత్వం కలగాలంటే నీ వెంట నీ కొడుకుకూడా వుండాలి."

"నా కొడుకా? అంతటి పసిపిల్లడు వాడు యీ అడవిలోకి ఎలా రాగలడు? ఎలా వుండగలడు?"

"నువ్వు తీసుకురా. నీ కొడుకు నీ వెంట వుండటానికి అభ్యంతరమేముంటుంది? సాధన పూర్తికాగానే మూలికలతోబాటు స్వర్ణసాధనా శక్తితో ఆనందంగా వెళ్ళిపోవచ్చును కదా యిరువురు కలిసి."

"అవుననుకోండి. మరి ఇప్పుడెలా తీసుకురావటం?"

"సాధన ప్రారంభించేది రేపు అమావాస్యరోజున కదా! నువ్వు తిరిగి వెళ్ళి రేపు సాయంత్రానికి నీ కొడుకును వెంటబెట్టుకుని రా. రేపు సూర్యాస్తమయం తర్వాత యిక్కడికిరా. రేపు రాత్రి క్రతువు ప్రారంభమవుతుంది."

జయరాం అయోమయావస్థలోనే అంగీకార సూచకంగా తలాడించాడు.

"ఈ రాత్రికి ఎక్కడైనా విశ్రమించు. నీ ఇంటికి వెళ్ళకూడదు. ఇదిగో మంత్రించిన విభూతి నీ నొసట పెడుతున్నాను. ఈ క్షణం నుంచీ నువ్వు దీక్షాబద్ధుడివై వుండాలి! ఏమాత్రం పొరపాటు జరిగినా మంత్రం బెడిసికొడుతుంది. ఇష్టమే కదా!"

"ఇష్టమే స్వామీ! కాని నా కొడుకుని తేవటం గురించే ఆలోచిస్తున్నాను. నా యింటికి వెళ్ళకూడ

దంటున్నారు. ఎవరితోను చెప్పకూడదంటున్నారు...."

"అదేమంత కష్టమైన పని? నీ బిడ్డ పాఠశాలలో చదువుకుంటున్నాడంటివి కదా! రేపు ఉదయం బయల్దేరి సరాసరి పాఠశాలనించి నీ కుమారుడ్ని వెంటబెట్టుకొని తిరిగి యిక్కడికి సూర్యాస్తమయం జరిగేటప్పటికి తీసుకు రాలేవా?"

"తీసుక రాగలను స్వామీ!"

"మంచిది. వెళ్ళిరా నాయనా! ఈ విషయం నీ కత్యంత ఆప్తులైన వాళ్ళకు కూడా తెలియకూడదు. నువ్వు యీ క్రతువు మొదలు పెట్టావు. మధ్యలో వెను కంజ వేస్తే అంతా అరిష్టమే, గుర్తుంచుకో!"

"అలాగే స్వామీ! ఈ రాత్రికి యిక్కడెక్కడో గడిపి రేపు బయలుదేరి మా వూరు వెళ్తాను. మీరు చెప్పినట్టే రేపు సాయంత్రం సూర్యాస్తమయ మయినాక నా బిడ్డతో యిక్కడికి వస్తాను."

"మంచిది. వెళ్ళిరా!" అన్నాడు సిద్ధుడు.

మర్నాడు—

కుమార్‌ని తీసుకొని వచ్చాడు జయరాం.

"రా, నాయనా! వీడు నీ బిడ్డా? ఆహా, అచ్చు నీ పోలికలన్నీ పుణికిపుచ్చుకున్నాడు. రా బిడ్డా, నువ్వు కూడా యీ దర్భాసనంమీద కూచో" అన్నాడు సిద్ధుడు నవ్వుతూ, తండ్రి వెనకగా భయంగా ఒదిగి వున్న కుమార్‌ని చూసి.

"భయం లేదు కుమార్! స్వామివారికి సాష్టాంగ నమస్కారం చెయ్యి" అన్నాడు జయరాం.

కుమార్ భయం భయంగా సిద్ధుడివంక చూస్తూ నమస్కారం చేశాడు.

అప్పుడు రాత్రి యేడుగంటలుదాటి యిరవై నిమిషాలయింది.

సిద్ధుడు జయరాంవైపు దయగా చూస్తూ, "నీ బిడ్డను తీసుకొస్తున్నట్టు యెవరితోను చెప్పలేదు కదూ!...." అన్నాడు.

"లేదు స్వామీ! అసలు నేనెవర్నీ కలుసుకోలేదు, పెదవి విప్పి మాట్లాడలేదు. మీరు చెప్పిన విధంగా నే దీక్ష వహించి మా బాబును తీసుకు వచ్చాను. ఏం చెయ్యాలో ఆజ్ఞాపించండి!" అన్నాడు జయరాం.

"చెప్తాను. రాత్రి సరిగ్గా పన్నెండు గంటలకు దీక్షలో కూర్చోవాలి! అందుకు కావలసిన రంగం సిద్ధం చేస్తాను. ఈ లోపల మీ యిద్దరు యేదో యింత తిని యీ గుహలో విశ్రమించండి" అన్నాడు సిద్ధుడు.

"అలాగే స్వామీ! తమ ఆజ్ఞ!" అన్నాడు జయరాం.

కుమార్ కి యిదంతా చాలా వింతగా, భయంగా అనిపిస్తోంది. యేదో యెప్పుడూ చూడని కొత్త వాతావరణం, భీభత్సంగా వున్న గుహ, దెయ్యాల్లా చుట్టూ చెట్లు, గుట్టలు, పుట్టలు గుండెల్లో గుబులు పుట్టిస్తూంటే, తండ్రి నంటిపెట్టుకుని వుండిపోయాడు.

జయరాం మనసునిండా బంగారమూ దాన్ని గురించిన ఆలోచనలే ముసురుకుంటున్నాయి. తన చిరకాల వాంఛితం నెరవేరబోతున్నందుకు ఆనందంతో తల మునక లవుతున్నాడు.

## 5

బస్ వేగంగా పోతోంది.

ఇద్దర్లో యెవరూ మాట్లాడటంలేదు, కేశవ్ మన

సంతా టెన్‌షన్‌తోను, భయంతోను నిండిపోయింది. అన్నయ్య అత్యాశకుపోయి ఏం పీకమీదకు తెచ్చుకున్నాడోనని అతని ఆలోచనంతా.

కరుణాకర్ ఆలోచనలుకూడా జయరాం చుట్టూనే తిరుగుతున్నాయి. ఎందుకు జయరాం యిలా దిగజారి పోయాడు? పైగా కొడుకును కూడా తనతో తీసుకుపోవలసిన పనేమి వచ్చింది? అతన్ని అంతగా ప్రేరేపించిన ఆ సిద్ధు డెవరు? ఉత్త పుణ్యానికి జయరాంకి ఎందుకా స్వర్ణ విద్య నేర్పటానికంగీకరించాడు? తలవిదిలించాడు.

బస్ బయల్దేరి అరగంట దాటింది. సామర్లకోట, పెద్దాపురంల మధ్యన వున్నది. మరో రెండు గంటల ప్రయాణం వున్నది.

సమయం రాత్రి ఎనిమిదిన్నర గంటలు.

కరుణాకర్, కేశవ్ పక్కపక్కనే కూచునివున్నారు. ఇద్దరు కూచునే సీటు అది!

ఎక్కువసేపు అలా మౌనంగా వుండలేకపోయాడు కేశవ్.

“అన్నయ్యకు అసలు యీ ప్రేరణ పుట్టించిందెవరో మీకు తెలుసా?” అన్నాడు కేశవ్.

“ఎవరో కొండజాతి మ్రాడు. అతనెలా కలిశాడో, జయరాం యిలా లొంగిపోయాడో నాకర్థం కాదు. వివరాలు పూర్తిగా చెప్పలేదు.”

“ఇదంతా ప్లాన్ మీద జరిగిందేమోనని అనుమానంగా వుంది.”

“కావచ్చు. జయరాం బలహీనతని తమ స్వార్థానికి వాడుకోవటానికి యెవరో కావాలని బంగారం ఆశ పెట్టి వుండొచ్చు. అంటే మీ అన్నయ్య గురించి, అతని అవ

సరాల గురించి బాగా తెలిసిన వాళ్ళకే అది సాధ్యపడు తుంది."

"అలాంటి వాళ్ళెవరు? అన్నయ్యకి మీరు అత్యంత సన్నిహితులు కదా! మీకు తెలిసి వుంటుందని అడుగు తున్నాను, అన్యథా భావించకండి."

"ఫరవాలేదు. ఇందులో అపార్థాలకు తావులేదు. అన్ని కోణాల నుంచీ ఆలోచించాలి. ఆఫీస్‌లో మీ అన్నయ్యంటే పడనివాళ్ళు ఒకరిద్దరు లేకపోలేదు. మీ అన్నయ్య అడ్డు లేకపోతే ప్రమోషన్ వాళ్ళకే వస్తుంది. కాని వాళ్ళు యింత ప్లాన్ వేసి వుంటారా అనే ఆలో చిస్తున్నాను."

"ఎందుకనుకోవాలి? అన్నయ్యని అడ్డు తొలగించుకుంటే వాళ్ళకే కదా ప్రమోషన్ వచ్చేది! స్వార్థం యింత పనయినా చేయిస్తుంది."

"అఫ్‌కోర్స్! ఆ విషయం కనిపెట్టడం పెద్ద కష్టం కాదనుకో. కాకినాడ తిరిగొచ్చాక ఆ విషయం మళ్ళీ ఆలోచిద్దాం."

వాళ్ళ మాటల మధ్య బస్ రాజవొమ్మంగి చేరింది. రాత్రి పదిన్నర గంటలయింది బస్ దిగేసరికి.

అమావాస్య చీకట్లు అంతటా పరుచుకుని వున్నాయి. బస్ స్టాండులో అక్కడక్కడ తక్కువ కేండిల్ బల్బులు చీకటిని పారద్రోలలేక పోతున్నాయి. అదే చివరి బస్ కావటంతో బస్టాండులోని పళ్ళ దుకాణాలు, సోడాబడ్డీలు కట్టేశారు. అంతా నిర్మానుష్యంగా వుంది. దూరంగా ఫారెస్టు ఠాణా దగ్గర మాత్రం ప్రకాశ వంతంగా వెలుగుతున్నాయి దీపాలు.

"ఎక్కడికి వెళ్దాం?" అన్నాడు కేశవ్ చీకటినీ,

భయంకరమైన నిశ్శబ్దాన్ని చూసి.

"ఇక్కడికి రెండు ఫర్లాంగుల దూరంనుంచి అడవి మొదలవుతుంది. నేనెప్పుడూ యిక్కడికి రాలేదు. రూమరో తెలిసినవాళ్ళు చెప్పుకోవటం తప్పితే యిక్కడి విషయాలు నాకేమాత్రం తెలియవు. ఎవర్నయినా అడుగుదాం."

"అందరూ దాదాపు నిద్రాణస్థలో వుండే సమయం. మనకి యిన్ఫర్మేషన్ యిచ్చేవాళ్ళెవరుంటారు?"

"అలా నిరాశపడొద్దు. లోకల్‌గా ఉండేవాళ్ళని ఎవర్నడిగినా చెప్పకపోరు. అయితే ఆ సిద్ధుడి గురించి డైరెక్టుగా అడక్కూడదు. ఫారెస్టు లోపలికి దారి తెల్సుకుంటే అక్కడ్నుంచి మన పాట్లు మనం పడదాం. నా వెంట నాలుగు సెల్సు టార్చిలైటు, అవసరమైతే ప్రాణరక్షణార్థం రెండు కత్తులు, తాడు, సిగరెట్ లైటర్ వంటి పరికరాలు తెచ్చాను" అన్నాడు కరుణాకర్. అతని భుజానికి పెద్ద ఏర్ బ్యాగ్ వేలాడుతోంది.

కేశవ్ సిగ్గుపడ్డాడు, తను ఏమాత్రంకూడా సిద్ధపడి రానందుకు. మనసు చికాకుగా వున్నప్పుడు అన్‌సెటిల్డుగా వున్నప్పుడు మరే విషయంమీదకు దృష్టిపోదు. తనిప్పుడు అదే సితిలో వున్నాడు.

"మనతో బాటు బస్‌లో దిగాడు చూడు. ఆయన బాగా చదువుకున్నవాడిలా వున్నాడు. ఏ టీచరో, లేక యిక్కడి ఆఫీసుల్లో ఎక్కడైనా పనిచేస్తున్న ఉద్యోగో అయ్యుండొచ్చు. త్వరగా నడు. ఆయన్ని కల్సుకుని వివరాలు సేకరిద్దాం" దూరంగా నడిచి వెళ్తున్న ఓ నడివయసు వ్యక్తిని చూపిస్తూ అన్నాడు కరుణాకర్.

ఐదు నిమిషాల్లో ఆయన్ని కల్సుకున్నా రిద్దరూ.

కరుణాకర్ అడిగినదానికి ఆ వ్యక్తి ఆశ్చర్యపోయి, "ఏమిటి, అడవిలోకి దారా? ఈ టైంలోనా? అంత అవసర మేమి వచ్చింది?" అన్నాడు యిద్దరివంక సాలోచనగా చూస్తూ.

కరుణాకర్ యేం చెప్పాలా అని క్షణం తటపటపడని, "మేము హెల్తు డిపార్టుమెంటునించి వస్తున్నాం. ఇక్కడ మలేరియా జ్వరాలతో తీవ్రంగా బాధపడుతున్న గిరిజనులకు రాడికల్ ట్రీట్ మెంట్ యివ్వటాని కొచ్చాం. మీకు తెలిసే వుంటుంది, యిక్కడ మలేరియా జ్వరాలు అధికంగా వున్నాయనీ, అది అంటువ్యాధి అనీను. ఒక్కొక్కరోజు ఆలస్యమయ్యే కొద్దీ కొన్ని వందల మందికి అది దోమకాటు ద్వారా వ్యాపిస్తుంది. అందుకే ఈ రాత్రికి రాత్రి కొందరికైనా ట్రీట్ మెంటివ్వాలని బయల్దేరి వచ్చాం."

ఆ వ్యక్తి చేయిచాచి వారితో కరచాలనం చేసి, "చాలా సంతోషం. మిమ్మల్ని కల్సుకోవటం ఆనందదాయకం. బైదిబై, నా పేరు పశుపతి. ఇక్కడ వెటర్నరీ డాక్టర్ గా పనిచేస్తున్నాను. నావల్ల మీకేం సహాయం కావాలి?" అన్నాడు కరుణాకర్ భుజానున్న బేగ్ వంక చూస్తూ.

"మిమ్మల్ని కల్సుకోగలిగినందుకు చాలా సంతోషంగా వున్నది" అన్నాడు కరుణాకర్.

"దయచేసి ఫారెస్టు లోపలకు దారి చూపించండి. మా ట్రీట్ మెంటు ప్రారంభిస్తాం."

"ఈ రాత్రి సమయంలో యేం అవసరపడతారు? నేను మా వెటర్నరీ హాస్పిటల్లో మీకు యీ రాత్రికి వసతి యేర్పాటు చేస్తాను. రెస్టు తీసుకొని, రేపు తెల్లా

ర్తానే మీ పని ప్రారంభించవచ్చు" అన్నాడు పశుపతి.

కరుణాకర్ వెంటనే, "అన్యధా భావించకండి. మలేరియా భయంకరమైన అంటుజ్వరం. అతి తొందరగా వ్యాపించే వ్యాధి. అందుకని పాజిటివ్ కేసుల్ని అర్జంటుగా ట్రీట్ చెయ్యాలి. అందుకే మా తొందర" అన్నాడు.

"అలాగే! మీ యిష్టం. ఈ చీకట్లో కొత్తచోటు అందునా అడవిలో మీరేం అవసలు పడతారోనని నా భయం....ఇదిగో, ఆ లైట్లు కనిపిస్తున్నాయి చూశారా, అదే ఫారెస్టు ఠాణా. అక్కడ ఫారెస్టర్, ఠాణేదార్ గార్డు వగయిరా సిబ్బందికి క్వార్టర్సుంటాయి. అవి దాటుకుని లోపలకు వెళ్తే కోయ గూడేలుంటాయి. మీ దగ్గర పేర్లుంటాయేమో కదా!"

"ఆ, ఆc! వున్నాయి. పాజిటివ్ కేసుల పేర్లన్నీ లిస్టు రాసుకున్నాం."

"మంచిది. కాని, ఒక్క విషయం మీకు చెప్పాల్సి వుంటుంది జాగ్రత్తగా వినండి...." అన్నాడు పశుపతి లోగొంతుతో.

కరుణాకర్, కేశవ్ అతనివంక ఆసక్తిగా చూశారు.

"ఆ క్వార్టర్సుకి కుడివైపు దాదాపు రెండు మైళ్ళు పోతే. జనసంచారంలేని కొండ గుహలున్నాయి. అటు వైపు మాత్రం పొరపాటునకూడా పోవద్దు."

"ఎందుకలా అంటున్నారు?" అడిగాడు కేశవ్.

"అక్కడెవరో సిద్ధుడున్నాడని జనం చెప్పుకుంటారు. అతను యేదో అతీంద్రియ శక్తుల్ని సంపాదించటానికి నరబలులు యిస్తూంటాడని ప్రతీతి. అయితే ప్రత్యక్షంగా చూసిన వాళ్ళెవరూ లేరనుకోండి. కాని నిప్పులేనిదే

పొగరాదుగా!" అన్నాడు పశుపతి.

తమకు కావలసిన విషయాన్ని అతను ప్రస్తావించటం ఇద్దరికీ చాలా ఆనందం కలిగించింది. మరి కొన్ని వివరాలు అతన్నుంచి సేకరించారు.

పశుపతి చెప్పిన కథనం ప్రకారం అక్కడ దాదాపుగా ఓ వృద్ధుడు ఓ కొండగుహాలో నివాసమేర్పరచుకుని వుంటున్నాడు. ఎప్పుడూ ధ్యానసమాధిలో వుండే ఆ వృద్ధుడు కొండజాతి వాళ్ళకు ఆరాధ్యనీయుడు.

అతన్ని అందరు సాములోరు అని పిల్చుకుంటూరు. అయ్యోరూ అంటూ పడిపడి మొక్కుతారు. కొండజాతి క్షేమంకోసం, వాళ్ళ ఉన్నతికోసం మాత్రమే తను నిత్యం తపస్సమాధిలో వుంటున్నట్టు చెపుతుంటాడు. దాంతో అమాయక కొండ ప్రజ అతనికి బ్రహ్మారథం పడుతున్నారు.

అయితే అక్కడ ఉద్యోగాలు చేసుకుంటున్న వారి కుటుంబ సభ్యులు కొందరు అప్పుడప్పుడు మాయం కావటంతో వాళ్ళందరు ఆందోళన చెంది నిఘా వేయగా ఆ సిద్ధుడు వాళ్ళని మాయం చేస్తున్నాడని తెలిసింది. అయితే ప్రత్యక్షంగా చూపినవాళ్ళు లేరు.

మాయమైన వాళ్ళు అందరు మగపిల్లలే కావటం, పది సంవత్సరాలలోపు వయసువాళ్ళు కావటం అందర్నీ ఆశ్చర్యపరచింది. దాన్నిబట్టి ఆ సిద్ధుడే వాళ్ళని తీసుకుపోయి బలిచ్చి వుండొచ్చునని అనుమానించారు.

అయితే సిద్ధుడ్ని ప్రశ్నించటానికిగాని అతణ్ని కలుసుకోవటానికిగాని యెవరికీ అనుమతి యివ్వబడదు. పైగా కొండజాతి మనుషులు అనునిత్యం అక్కడ కాపుకాస్తుంటారు. సిద్ధుడిమీద ఈగ కూడా వాలనివ్వకుండా చూసు

కుంటారు.

అందుకే ఎవరూ అతన్ని కల్సుకోవటానికిగాని, నేరం మోపడానికిగాని ధైర్యం చెయ్యలేదు తమకు జరిగిన అన్యాయానికి కుమిలిపోయి అక్కడ్నుంచి బదిలీలు చేయించుకుని వెళ్ళిపోయారు."

"ఇంత జరిగినా పోలీసులుగాని, నాయకులుగాని యెవరూ పట్టించుకోలేదా?" అనడిగాడు కరుణాకర్.

కేశవ్ కి ఆ పాటికే జరగబోతున్న ఘోరం కళ్ళకు కట్టినట్టు కనిపించి నరనాడులు కృంగిపోయాయి. అన్నయ్య కుమార్ నెందుకు అర్జంటుగా తీసుకొచ్చేశాడో అర్థమై పోయింది.

బంగారం పిచ్చిలో పడి సిద్ధుడి మాయలో చిక్కుకు పోయి అతని చేతిలో కీలుబొమ్మయిపోయాడు. అందుకే అతని ఆజ్ఞలను శిరసావహించి. కట్టుకున్న భార్యకూడా చెప్పకుండా కన్నకొడుకును తీసుకుపోయి సిద్ధుడి కప్ప గించేశాడు.

అయితే అతనికి సిద్ధుడి పన్నాగం తెలిసి వుండదు. తెలిసి తెలిసి ఏ కన్నతండ్రీ కొడుకును బలిచేసుకోవ టానికి సిద్ధపడడు. డబ్బుకోసం ఒక్కగానొక్క కొడుకు ప్రాణం పణంగా పెట్టడు. అన్నయ్యని మభ్య పెట్టి కుమార్ ని రప్పించాడు.

ఇప్పుడు పశుపతి చెప్పిన మాటలతో తన అనుమానం పూర్తిగా బలపడింది. ఖచ్చితంగా బలివ్వటానికే కుమార్ ని రప్పించాడు సిద్ధుడు.

కరుణాకర్ ప్రశ్నకు పశుపతి తల అడ్డంగా తిప్పి, "పోలీసులకూడా సిద్ధుడి దరిదాపులకు పోవటానికి ధైర్యంలేదు. నాయకులు కూడా యిక్కడెవరున్నారు?

కోయగూడెం నాయకులే కదా! వాళ్ళు సిద్ధుడికి దాసానుదాసులు. పెదవి మెదపరు.

ఈ రోజు మిమ్మల్ని యెందుకు వారిస్తున్నానో తెలుసా? ప్రతి అమావాస్య రోజున అర్ధరాత్రి ఆ కొండ గుహల పరిసరాల్లో ఖచ్చితంగా యేదోక నరబలి జరుగుతునే వుంటుందని తెలిసినవాళ్ళు చెపుతారు. ఇప్పుడు సమయం అర్ధరాత్రి దగ్గరపడుతోంది. ఈ సమయంలో అడవిలోపలికి పోవాలని యెవరూ అనుకోరు చివరికి ఫారెస్టు డిపార్టుమెంటు వాళ్ళుకూడా యీ సమయంలో అడవిలోకి పోరు—"

కరుణాకర్, కేశవ్‌లు అతని మాటలు వింటూనే తీవ్రంగా ఆలోచిస్తున్నారు. వాళ్ళ మనసులోకి ప్రవేశించిన మాట ఒకటే! అర్ధరాత్రి పన్నెండు గంటలకు బలి కార్యక్రమం ఉంటుంది. అంటే సరిగ్గా మరో గంటలో ....

గంట వ్యవధిలో తామేం చెయ్యగలరో, ఎలా యీ ఘోరాన్ని ఆపుచేయాలో వాళ్ళ మనసుల్ని తొలిచేస్తోంది! అదే సమస్యమీద యిద్దరు మనసులోనే తర్జన భర్జనలు చేసుకొంటున్నారు. త్వరగా అడవిలోపలికి— సిద్ధుడి కొండగుహల దగ్గరకు—చేరుకోవాలి!

అతని దగ్గర సెలవు తీసుకుని, ఇద్దరూ అడవిదారి పట్టారు.

## 6

"తండ్రీ బిడ్డలిద్దరు యీ కాలవలో శుచిగా స్నానం చెయ్యండి. తరువాత కార్యక్రమం చెపుతాను" అన్నాడు నిత్యానందస్వామి.

జయరాం కుమార్‌తో కలిసి కాలవలోకి దిగాడు.

నీళ్ళు చల్లగా ఒంటిని తాకి వణికింపచేశాయి. కుమార్ కొందలే తట్టుకోలేకపోయాడు.

"డాడీ. బాగా చలిగా వుంది. నేను స్నానం చెయ్యలేను" అన్నాడు, నీటిలోనుంచి బయటకొచ్చెయ్యటానికి ప్రయత్నిస్తూ.

"ఫర్వాలేదు కుమార్. రెండు నిముషాలు....అం అయిపోయింది" అంటూ బుజ్జగిస్తూ ఐస్‌లా ఎముకల్ని కొరికేస్తున్న నీటిలో, నెత్తురు గడ్డకట్టించే చలిలో స్నానాలు పూర్తిచేశాడు జయరామ్.

ఆకాశంలో మినుకుమంటున్న చుక్కలు కాలువ నీటిలో ప్రతిఫలిస్తున్నాయి. అక్కడ తప్పితే చుట్టు పక్కల యెక్కడా ఆకాశం కూడా కనిపించనంత గుబురుగా పెరిగిపోయిన చెట్లు.

అమావాస్య రాత్రి అంత గాఢాంధకారంగా వుంటుందన్న విషయం ఆ రోజే మొదటిసారిగా తెలిసి వచ్చింది జయరాంకి.

అంతసేపు గట్టుమీద స్వామి నిల్చునే ఉన్నాడు. మళ్ళీ తమ గుడ్డలు వేసుకుంటుంటే వారించి, "అవి వద్దు. పూజకి అర్హమైనవి కావవి. ఈ నారబట్టలు కట్టుకోండి" అన్నాడు నారగుడ్డలు అందిస్తూ.

జయరాం ఎందుకు, ఏమిటని ప్రశ్నించే స్థితిలో లేడు. తన కోరిక మరికొన్ని గంటల్లో నెరవేరబోతున్నదని ఆనందంలో తలమునకలవుతున్నాడు. స్వామి చెప్పింది వేదవాక్యన్నట్టు తు.చ. తప్పకుండా ఆచరిస్తున్నాడు. కుమార్ చేత కూడా ఆచరింపచేయిస్తున్నాడు.

అయితే అతను ఏమాత్రం మనసు పెట్టి ఆలోచించినా, ఇందులో కుమార్ ప్రమేయమెందుకొచ్చిందన్న విషయం

అరమయి వుండేది. కాని అతనిప్పుడు పూర్తిగా స్వామి స్వాధీనంలో వున్నాడు. అతను హిప్నటిస్టులాగా, తను ట్రాన్స్‌లో వున్నవాడిలాగా మంత్రముగ్ధుడిలాగా చేసుకు పోతున్నాడు.

అప్పటికి చీకటికి బాగా అలవాటుపడ్డాయి జయరాం కళ్ళు. చెయ్యి తిప్పి టైం చూసుకోబోయాడు. కాని చేతికి వాచీలేదు. గుహలో వదిలేసి వచ్చాడు స్నానానికి వచ్చేముందు. గుహ దగ్గర బయల్దేరినప్పుడు తొమ్మిది గంటలయింది. ఇప్పుడు మరోగంట కలుపుకోవచ్చుననుకున్నాడు.

మళ్ళీ గుహ దగ్గరకు చేరుకున్నారు ముగ్గురు.

గుహ దగ్గర నలుగురు కోయవాళ్ళు చేతుల్లో నూనె గుడ్డలు చుట్టిన కాగడాలతో నిల్చుని వున్నారు. కొండ గుహలు. ఆ పరిసర ప్రాంతాలు వెలుగుతో నిండిపోయాయి.

చీకట్లోంచి ఒక్కసారిగా వెలుగులోకి రాగానే కళ్ళు మిరుమిట్లు గొలిపాయి జయరాంకి. కుమార్ నిద్ర మత్తులో జోగుతున్నాడు. జయరాం భుజంమీద తల వాల్చి నిద్రకు పడుతున్నాడు.

"నాయనా, బిడ్డ నిద్రపోతున్నాడు. నిద్రపోనివ్వద్దు. జరగవలసిన క్రతువుకి పుత్రుడు తప్పకుండా ఉండాలి" హెచ్చరించాడు స్వామి.

జయరాం చేత్తో తట్టి లేపి కుమార్‌ని బండరాతిమీద కూచో బెట్టాడు.

గుహలో. నాలుగైదు బల్లపరుపుగా వున్న బండరాళ్ళు అమర్చబడి వున్నాయి. వాటిలో ఓ ఆసనంమీద పులి చర్మం పరచి వున్నది. అది స్వామి ఆసనం! తక్కిన బండరాళ్ళమీద దర్భ చాపలు పరచి వున్నాయి. అవి

జయరాంలాంటి వాళ్ళకు కోయ నాయకులులాంటి ప్రముఖులకు ఆఫర్ చేయబడుతాయి.

స్వామి జయరాంకి బండరాతి ఆసనంమీద కూర్చుండవలసిందిగా సౌంజ్ఞ చేశాడు. జయరాం కుమార్ ని పక్కన కూచోబెట్టుకొని తనూ కూచున్నాడు.

ఓ కోయనాయకుడు స్వామి ఆదేశంమీద ఓ పూసల దండ తెచ్చి జయరాం మెళ్ళో వేశాడు. మరో కోయవాడు దర్భపుల్లలు, ఆకులు కలిపి కట్టిన మరో దండను తెచ్చి కుమార్ మెళ్ళో వేశాడు.

జయరాం ఎందుకని అడగబోయి అంతలోనే విరమించుకున్నాడు. మొదట్లోనే స్వామి హెచ్చరించి వున్నాడు — ఈ తంతు విషయమై ఎందుకు, ఏమిటని ప్రశ్నించకూడదని, తనమీద పూర్తి విశ్వాసముంటేనే సిద్ధపడమని, లేకుంటే వచ్చినతోవనే తిరిగి వెళ్ళిపొమ్మని చాలా ఖచ్చితంగా చెప్పాడు.

అందుకే జయరాం మనసులో తేలుకొండీల్లా తలెత్తే ప్రశ్నలను మనసులోనే సమాధిచేసేస్తూ వచ్చాడు. నిష్ఠగా క్రతువుచేస్తే తప్ప ఫలితం లభించదని స్వామి చెప్పాడు.

"మా ఆచారం ప్రకారం కొండదేవతకు మొక్కుకుని యే పనైనా మొదలుపెడతాం. బంగారం చెయ్యటం వంటి అతి ముఖ్యమైన పనికి కొండదేవత ఆశీస్సులు చాలా అవసరం. ఓసారి అమ్మను దర్శించుకుని వద్దామా?" అన్నాడు స్వామి జయరాంవైపు నవ్వుతూ చూసి.

"అలాగే స్వామీ! తప్పక వెళ్దాం" అన్నాడు జయరాం.

"నీ బిడ్డను తీసుకువెళ్దాం. మా కొండనాయకు

ఎవడోకడు ఎత్తుకు తీసుకొస్తాడులే పద!" అన్నాడు స్వామి లేచి ముందుకు దారితీస్తూ.

ఓ కొండ నాయకుడు కుమార్‌నెత్తుకున్నాడు. మరో యిద్దరు కాగడాలతో వాళ్ళ ననుసరించారు. ఓ పది నిమిషాల తర్వాత కొండదేవత విగ్రహం దగ్గరకు చేరుకున్నారు.

జయరాం విగ్రహాన్ని చూస్తూనే ఒక్కడుగు వెనక్కు వేశాడు. అతి భయంకరమైన విగ్రహం! దాదాపు పది పన్నెండు అడుగుల ఎత్తుంటుంది. నాలుక ఎర్రగా మండే మంటలా బయటకు చాచి వున్నది. తలనుంచి పాదాల వరకు ఎర్రగా సింధూరం పూయబడి కాగడాల వెలుగులో నయన భయంకరంగా వున్నది.

కుమార్ అయితే ముందే కళ్ళు గట్టిగా మూసేసుకున్నాడు భయంతో. అంత చలిలోను ఆ పసివాడికి ముచ్చెమట్లు పోశాయి. సన్నగా ఒణుకుతున్నాడు.

కొండదేవత మెళ్ళోని హారం చూసి జయరాం శరీరం జలదరించింది. వెన్నున ఏదో పాకినట్టు ఝల్లుమన్నది.

మానవ కపాలాలు మాలగా కట్టి దేవత మెళ్ళో వేశారు. నాల్క చాచుకుని, కపాల హారం మెళ్ళో వేసుకుని, ఓ చేత్తో త్రిశూలాన్ని, మరో చేతిలో విచ్చు కత్తిని పట్టుకుని అతిభీకర భయంకరంగా వెలిగిపోతున్న ఆ దేవత సజీవమూర్తిలా కళ్ళెదుట నిల్చి కరవాలంతో తల తెగనరకటానికి సన్నద్ధమై వున్నట్టు కనిపించింది జయరాంకి.

విగ్రహం కాళ్ళ దగ్గర నిప్పురాజేసి వున్నది. విగ్రహం కాళ్ళముందు స్వామి మోకరిల్లి లేచాడు. విగ్రహం

కాళ్ళ ముందర ఓ మట్టిపాత్రలో వున్న భస్మంతీసి నిప్పులో వేల్చాడు. ఒక్కసారిగా విపరీతమైన పొగ లేచింది. చాలా దట్టంగా అలుముకొంది. సాంబ్రాణి కన్న చాలా ఘాటుగా, ఆ ప్రదేశాన్నంతా అదో రకమైన వింత వాసన చుట్టుముట్టింది.

స్వామి యేదో మంత్రాన్ని ఉచ్చస్వరంతో పలుకుతున్నాడు. అది తెలుగు కాదు, సంస్కృతం కూడా కాదు. అదేదో పైశాచిక భాషలాగా వున్నది. కఠిన పదజాలంతో చాలా నిష్ఠగా చదువుతున్నాడు స్వామి.

ఇంతలో ఓ కోయ నాయకుడు రాగిరేకు చుట్టను తెచ్చాడు. దాన్ని స్వామి అందుకుని దేవతా విగ్రహం పాదాల ముందుంచాడు.

జయరాం మనసు పురివిప్పిన నెమలిలా వుంది. ఎదురుగా రాగిరేకు చుట్ట బదులు బంగారు రేకు కనిపించి కన్నులపండుగ చేస్తోంది.

స్వామి భస్మం తీసి జయరాం కిచ్చి అగ్నిగుండంలో వేల్చమని చెప్పాడు. జయరాం అలాగే చేశాడు. ఏవో కొన్ని వనమూలికలు కూడా యిచ్చి అగ్నిలో వేయమన్నాడు స్వామి. జయరాం వేశాడు.

నీలిరంగు పొగ దట్టంగా అలుముకున్నది. ఆ ఘాటుకు కుమార్ కి తెరలు తెరలుగా దగ్గొచ్చింది. ఎడతెగకుండా దగ్గుతూ సొమ్మసిల్లి పోయాడు.

అప్పుడు రాత్రి పదకొండు గంటలయ్యింది.

## 7

కరుణాకర్ చేతిలోని నాలుగుసెల్స్ టార్చ్ ప్రకాశవంతంగా వెలుగు విరజిమ్ముతూ చాలా దూరంవరకు స్పష్టంగా దారి చూపిస్తోంది. ఇద్దరు అడవిదారి పట్టి

పదిహేను నిమిషాలయింది.

అంతకంతకు ఫారెస్టు తాణా ఆఫీసు, క్వార్టర్స్ దగ్గిర పడుతున్నాయి. క్వార్టర్సు బయట ఎవరో మనుషులు మసలుతున్న జాడ కనిపిస్తోంది.

"ఎవరో మసలుతున్నట్టుంది కదూ!" అన్నాడు కేశవ్.

"అందుకే ఆ క్వార్టర్స్ ముందు భాగం నించి కాక, వెనకనుంచి లోపలకి ప్రవేశించే దారేమైనా వుందేమో చూడాలి!"

ఇద్దరు మెల్లగా నడుస్తున్నారు. కరుణాకర్ వేళ్ళ సందునుంచి మాత్రమే టార్చి వెలుగు నేలమీద పడేలా అరచేతో అద్దాన్ని మూసిపట్టుకున్నాడు. తమ ఉనికి ఎవరికీ తెలియకూడదని అతని ఉద్దేశం!

పశుపతి చెప్పిన గుర్తులు కేశవ్ బాగా గుర్తుపెట్టుకున్నాడు. క్వార్టర్సుకి కుడివైపు నుంచి రెండు మైళ్ళు నడిస్తే కొండ గుహలొస్తాయి. ఆ కొండ గుహల్లో ఓ దాంట్లో నిదురుంటున్నాడు.

క్వార్టర్సు వెనకపక్క అంతా తుప్పలు, పొదలు పుట్టలతో నిండిపోయివున్నాయి. ఛురకత్తుల్లా మొన తేలిన రాళ్ళు గుబులు పుట్టిస్తూన్నాయి. క్వార్టర్సు ముందునుంచి మాత్రమే దారిచేశారు. క్వార్టర్సు చివరి వరకు ఆ రోడ్డు సాక్షిగా వున్నది.

కరుణాకర్ కేశవ్ వంక చూసి "ఇక క్వార్టర్సు ముందునుంచి వెళ్ళక తప్పేలా లేదు. ఎలా?" అన్నాడు.

క్వార్టర్స్ ముందు ఇద్దరు వ్యక్తులు సిగరెట్లో చుట్టలో తాగుతున్న సూచనగా ఎర్రటి నిప్పు వాళ్ళ పెదాల దగ్గర కనిపిస్తోంది. వాళ్ళు సెంట్రీలో లేక ఆ క్వార్టర్సులో నివాసముంటున్న వాళ్లో కావచ్చును.

"నేను వాళ్ళ దృష్టిని మళ్ళిస్తాను. వాళ్ళు అటు వెళ్ళగానే మనం దాటెయ్యొచ్చు" అన్నాడు కేశవ్.

"ఎలా మళ్ళిస్తావు? వాళ్ళు గమనిస్తే ప్రమాదం కదా... !"

కేశవ్ నేలమీద ఓ మాదిరిగా పెద్దగా వున్న రాళ్ళను ఏరాడు. క్వార్టర్స్‌కి ఎడమపక్కగా గుబురు పొదల మధ్యకు రాళ్ళు విసిరాడు. పొదల్లో రాళ్ళు సృష్టించిన ధ్వని నిశ్శబ్దంగా వున్న ఆ వాతావరణంలో స్పష్టంగా వినిపించింది.

క్వార్టర్స్ ముందునించున్న వ్యక్తులిద్దర్లోను ఆశించిన మార్పు కనిపించింది. ఇద్దరు చేతుల్లో గన్స్ పట్టుకుని పొదలవైపు నెమ్మదిగా అడుగులు వేస్తూ వెళ్ళారు. వాళ్ళ చేతుల్లో కూడా టార్చిలైట్సున్నాయి.

కేశవ్ కరుణాకర్ వంక చూసి "ఇదేమంచి అవకాశం. పొదం వైపునుంచి వెనక్కి మళ్ళేలోపుగా మనం గుహల వైపు పోయే కుడివైపు దారిపట్టాలి" అన్నాడు వేగంగా అటు అడుగులు వేస్తూ.

కరుణాకర్ అతని వంక ప్రశంసాపూర్వకంగా చూసి, "గుడ్ అయిడియా!" అన్నాడు.

కరుణాకర్ కేశవ్ రెండు నిమిషాల్లో క్వార్టర్సు దాటేసి, గుహలవైపు పోయే దారిలోకి మళ్ళిపోయారు. టార్చిలైటు ఫోకస్ చెయ్యకుండా చీకటికి అలవాటు పడ్డ కళ్ళతో దారి వెతుక్కుంటూ కొద్ది గజాలు వెళ్ళారు.

కేశవ్ వెనక్కి తిరిగి క్వార్టర్సువైపు చూశాడు. ఆ సెంట్రీలిద్దరు మళ్ళీ క్వార్టర్సు దగ్గరకొచ్చేశారు. వాళ్ళ మాటలు వినిపించటంలేదు. టార్చి ఫోకస్‌నిబట్టి వాళ్ళ

ఉనికిని గ్రహించాడు కేశవ్.

పదిగజాలు వెళ్ళే సరికి దారి యిరుకైపోయింది. పొదలు, గుట్టలు దట్టంగా అలుముకుని వున్న ఆ ప్రాంతమంతా అడుగు కదపటానికి వీల్లేకుండా భయోత్పాతం పుట్టిస్తున్నది.

భయంకరమైన నిశ్శబ్దం మధ్య జంతువుల అరుపులు ఒళ్ళు జలదరింప చేస్తున్నాయి. నక్కల ఊళలు కలవరం పుట్టిస్తున్నాయి.

"ఇప్పుడెలా? మనం వస్తున్నది సరైన దారి అయి వుండదు. అందుకే దారి ఇక్కడితో మూసుకుపోయింది. పశుపతి చెప్పిన గుర్తులు బాగా గుర్తుపెట్టుకున్నావా?" అడిగాడు కరుణాకర్.

"సరిగానే వస్తున్నాం. క్వార్టర్సుకి కుడివైపు నుంచి రెండు మైళ్ళు వెళ్తే గుహాలొస్తాయని చెప్పాడాయన."

"దారి సీదాగా వుంటుందని చెప్పలేదు కదా! ఈ చెట్లు, గుట్టలు కోయవాళ్ళకు కొట్టిన పిండి కాబట్టి సరైన దారంటూ లేకపోయినా ఎలాగో నడిచి వెళ్ళిపోగలరు. మనంకూడా యిక తెగించి అలా వెళ్ళాల్సిందే!"

"మనం ఆలోచిస్తూ వుండిపోతే అవతల అర్ధరాత్రి సమీపిస్తోంది. చేతులు కాలాక చేసేదేం లేదు" అన్నాడు కేశవ్. అతను టెన్షన్ భరించలేకపోతున్నాడు.

కేశవ్ వాచీ చూసుకున్నాడు. పదకొండూ యిరవై అయిదు నిమిషాలయింది. అరగంటలో తామిద్దరు కొండ గుహల్ని చేరుకోవటం సాధ్యమేనా?

"ఈ గుట్టమీదుగా నడిచి వెళ్ళిపోదామా?" అన్నాడు

కేశవ్.

"ఇప్పుడు, చుట్టుపక్కల యెక్కడా కాలిబాట కనిపించటంలేదు. కావాలనే దుర్గమంగా వున్న స్పాట్ ఎన్నుకుని వుంటాడా సిద్ధు. ఎవరికీ కనిపించకుండా ఎవరు అడ్డుకోవటానికి వీల్లేకుండా తన రహస్య కలాపాలు జరుపుకోవాలి కదా!" అన్నాడు కరుణాకర్.

ఇద్దరు ఏటవాలుగావున్న గుట్ట ఎక్కారు. కాళ్ళు జారిపోతున్నాయి. నిలదొక్కుకుంటూ, ఒకరినొకరు ఆసరా చేసుకుని గుట్ట ఎక్కారు.

మళ్ళీ అవతల పక్కన స్లోప్‌గా ఉన్నది. గుట్ట దిగువ నుంచి సన్నని కాలిబాట కనిపిస్తోంది టార్చి వెలుగులో.

"గుడ్! దారివున్నది. జాగ్రత్తగా దిగు...." అంటూ కేశవ్‌ని హెచ్చరిస్తూనే తను ముందుకి తూలిపోయాడు కరుణాకర్. మరుక్షణం బండరాళ్ళమీదకు సరాసరి పడిపోయి వుండేవాడు. కేశవ్ చాలా ఎలర్ట్‌గా పట్టుకున్నాడతన్ని.

ఇద్దరు ఒకరినొకరు పట్టుకుని కిందికి దొర్లిపోకుండా ఆపుకున్నారు.

"థాంక్యూ!" అన్నాడు కరుణాకర్ సర్దుకుని.

సరిగ్గా గుట్ట దిగువన వాళ్ళకోసం ప్రమాదం పొంచి వున్న విషయం వాళ్ళకి తెలియదు.

గుట్ట దిగబోతూ ఎదురుగా కనిపించిన దృశ్యాన్ని చూసి నిశ్చేష్టులై నిలుచుండిపోయారు.

# 8

కోయ నాయకుల్లో ఒకడు ఆకు నేదో నలిపి కుమార్‌కి వాసన చూపించాడు.... కుమార్ వెంటనే కళ్ళు తెరి

చాడు.

అంతవరకూ జయరాం ఆందోళనగా కొడుకు ముఖం లోకే చూస్తూ వుండిపోయాడు. స్వామి మాత్రం చిద్విలాసంగా చూస్తున్నాడు.

"ఫర్వాలేదు నాయనా, నీ బిడ్డ ప్రాణాని కేం ప్రమాదం లేదు, ఆందోళన చెందకు...." అన్నాడు స్వామి.

"నువ్వు నాతో రా నాయనా! నీ బిడ్డను మా వాళ్ళు జాగ్రత్తగా చూస్తూంటారు. మనం వనమూలికల్ని సేకరించుకుని వద్దాం" అంటూ లేచాడు స్వామి.

జయరాం మహదానందంగా స్వామి వెంట బయలు దేరాడు. ఒక నాయకుడు మాత్రం కాగడా పట్టుకుని వారిద్దర్నీ అనుసరిస్తున్నాడు. అలవాటయిన దారిలో జయరాంకన్న వేగంగా ముందుకు పెద్ద పెద్ద అంగలు వేస్తూ నడుస్తూన్నాడు స్వామి. అతనికి ఓ పక్కగా కాగడా పట్టుకున్న నాయకుడు ఒదిగి ఒదిగి నడుస్తూన్నాడు.

దాదాపు ఓ పదినిమిషాలపాటు నడిచారు ముగ్గురూ. ఈ లోపల రకరకాల అడవి జంతువులు వారి ముందు నుంచి పరుగులు పెడుతూ వెళ్ళటం జయరాం గమనించాడు.

కుందేళ్ళు, లేళ్ళు, దుప్పులులాంటి సాధు జంతువులతో బాటు అడవిదున్నలు, జాగిలాలు, తోడేళ్ళు, నక్కలు, ముళ్ళపందులు లాంటి క్రూరజంతువులు కూడా పరుగులు పెడుతూ వెళ్ళటం చూశాడు. మధ్య మధ్య ఎండుటాకుల మీద జరజరా పాక్కుంటూ వెళ్తున్న పాములు కనిపించాయి.

అయితే అవేవీ సిద్ధుడి దరిదాపులక్కూడా రాకుండా ఒదిగి ఒదిగి వెళ్ళిపోవటం చూసి మహా ఆశ్చర్యంగా వుందతనికి.

సిద్ధుడిపట్ల నమ్మకం మరింత పెరిగింది జయరాంకి. అదంతా సిద్ధుడి మహిమే! క్రూరజంతువు సయితం సాధు జంతువుగా మారటం సిద్ధుడి ప్రభావంవల్లనే నని గాఢ మయిన నమ్మకం కలిగింది.

తను చాలా అదృష్టవంతుడు! ఎవరికీ సాధారణంగా లభ్యంకాని బంగారం చేసే విద్య తనకీనాడు లభ్య మయ్యింది. మరికాసేపట్లో అమూల్యమయిన బంగారం తన వశం కాబోతోంది. మూలికలు తనవెంట తీసుకు పోవాలి. వీలైనంత యెక్కువ రాగిని బంగారంగా మార్చె య్యాలి! ప్రపంచంలో కెల్లా గొప్ప ఐశ్వర్యవంతుడ్నయి పోవాలి!

జయరాం ఆలోచనలు బంగారం చుట్టూ తిరుగు తున్నాయి.

“ఇక్కడ ఆగు నాయనా! అదిగో, ఆ దేవదారు చెట్టుకింద పరీక్షగా చూడు. పసుపు పచ్చని పువ్వు లున్న మొక్కలేమయినా కనిపిస్తున్నాయా?” అన్నాడు స్వామి.

జయరాం కళ్ళు చికిలించి దేవదారు చెట్టువైపు పరిశీల నగా చూశాడు.

అతని కళ్ళు మిలమిల మెరిశాయి.

చెట్టు కింద పసుపు పచ్చని పూలున్న మొక్క లున్నాయి!

“ఉన్నాయి స్వామీ!” అన్నాడు.

స్వామి జయరాం భుజం తట్టి, “నీ క్రతువు ఫలిం

చింది నాయనా! నిష్ఠగా క్రతువులో నీ బిడ్డతో బాటు పాల్గొన్నందుకు నీ అభీష్టం నెరవేరింది. ఆ మొక్కలను వేళ్ళతో పాటు పెరికి, వేరు భాగం గుప్పిట్లో మూసి తీసు కొని రా. గుహలో బంగారం ఎలా చెయ్యాలో చెపు తాను" అన్నాడు.

జయరాం మొక్కల్ని పీకి వాటి వేరులను గుప్పిట్లో మూసి పట్టుకున్నాడు.

"ఎన్ని మొక్కలు పెరకను స్వామీ!"

"నాలుగు చాలు!" అన్నాడు స్వామి.

నాలుగు మొక్కల్ని పెరికి స్వామి వెంట గుహకు తిరిగివచ్చాడు జయరాం.

"వేరు భాగాలని చితక్కొట్టి రసం వచ్చేవరకు గట్టిగా పిండు....ఆఁ!....ఇప్పుడు ఆ రసాన్ని ఈ రాగి రేకుకి పూర్తిగా పొయ్యి. నేను చెప్పే మంత్రం పఠించు" అన్నాడు స్వామి ఆసనంపై కూచుని.

జయరాం అతను చెప్పినట్టే మంత్రం చదువుతూ రాగి రేకుపై ఆ వేళ్ళ రసాన్ని మలామా చేశాడు. పదినిమిషాలు గడిచాయి.

రాగిరేకు ఎలాంటి దలాగే వున్నది.

బంగారు రేకుగా మారలేదు.

అప్పుడు సమయం పదకొండునలభై అయిదు నిమిషా లయింది!

స్వామి పెదవి విరిచి, "లాభంలేదు నాయనా! నీ నిష్ఠకు కొండదేవత సంతృప్తిపడలేదు. ఆమెను సంతృప్తి చేయటానికి ఒక్కటేమార్గం! ..." అన్నాడు ఓ క్షణం ఆగి.

జయరాంలో టెన్షన్ పెరిగిపోయింది. అంత క్రితం

వరకూ తనకు బంగారం చేసే విద్య పట్టుబడిపోయిందని ఆనందంతో తలమునకలయ్యాడు. కాని ఇంతలోనే పరిస్థితి తారుమారయ్యింది. ఇంతపడ్డ శ్రమ వ్యర్థమేనా....?

స్వామి ప్రశ్నకు బదులుగా, "చెప్పండి స్వామీ! కొండదేవతను సంతృప్తిపరుస్తాను. వెంటనే చెప్పండి!" అన్నాడు.

"కాని....కాని....అది జరిగే పనికాదు నాయనా! నిన్నలాంటి పని చేయమని నే నడక్కూడదు. నువ్వు చెయ్యకూడదు. వద్దు నాయనా, బంగారంమీద ఆశ వదులుకొని నీ బిడ్డతోబాటు యింటికి తిరిగి వెళ్ళిపో!" అన్నాడు స్వామి.

అతనలా అనే కొద్దీ జయరాంలో పట్టుదల దృఢ నిశ్చయం మరింతగా బలపడ్డాయి. "ఫర్వాలేదు స్వామీ! మీ మాట శిరసావహిస్తాను. ఇంతదాకా వచ్చాక సంకోచిస్తానను కొంటున్నారా....? అసంభవం! చెప్పండి...." అన్నాడు.

"వద్దు నాయనా! నా మాటమీద యే మాత్రం గౌరవమున్నా వెంటనే నీవు యింటికి తిరిగి వెళ్ళిపో, నీ బిడ్డతోబాటు! ఇంకొక్క క్షణం కూడా యిక్కడ వుండొద్దు."

"స్వామీ! నన్ను శంకించకండి. వెంటనే చెప్పండి. నా నిష్ఠ నిశ్చయం తిరుగులేనివి" చాలా సిన్సియర్‌గా చెప్పాడు జయరాం.

సిద్ధుడు లేచి నిల్చుని సూటిగా జయరాం వంక చూసి, "చేస్తానంటావా? అన్న మాటకు నిలబడగలవా?" అన్నాడు.

జయరాం స్థిరంగా చెప్పాడు, "చేస్తాను!"

"అయితే విను. నీవు బంగారంచేసే విద్య పట్టుబడా లంటే యేం చెయ్యాలో చెప్తున్నాను. గుండె దిటవు చేసుకుని విను! నీ కన్నకొడుకును నీ చేతుల్తోనే ఒక్క వేటుకు నరికి అమ్మకు రక్తతర్పణ చెయ్యాలి. ఆ మరు క్షణం నీకు ఆ విద్య వశమవుతుంది" అన్నాడు నిత్యానందస్వామి.

నెత్తిన పిడుగుపడ్డట్టు చేష్టలుడిగి, కొయ్యబారిపోయాడు జయరాం.

పన్నెండు కావటానికి అయిదు నిమిషాలు మాత్రం మిగిలివుంది.

## 9

కొంతసేపటి వరకు తేరుకోలేదు కేశవ్, కరుణాకర్.

గుట్ట దిగువన బాటమీద అడ్డుగా పడుకొనివుంది పెద్ద పులి! చాలా తాపీగా, హుందాగా, దర్జాగా పడుకొని విశ్రాంతి తీసుకొంటోంది. ఏమాత్రం అలికిడి అయినా తమమీదికి దూకి చీల్చి చెండాడుతుంది. అప్పటికే ఇద్దరు గుట్ట దిగిపోయారు.

పులికి, వాళ్ళకు మధ్యదూరం కేవలం కొన్ని గజాలు మాత్రమే! ఇద్దరూ ఊపిరి బిగబట్టి దానివంకే గుడ్లప్ప గించి చూస్తూన్నారు.

పులి యిప్పట్లో అక్కడ్నుంచి వెళ్ళేలా కనిపించటం లేదు. ఓ పక్క సమయం మించిపోతోంది. అర్ధరాత్రి దగ్గర పడుతోంది. పశుపతి మాటలు చెవుల్లో గింగురు మంటున్నాయి.

"ఓ అయిడియా!" అన్నాడు కేశవ్.

"ఏమిటది?"

"మంటల్ని చూస్తే పులి బెదిరిపోతుందంటారు కదా!

ఎండు చితుకులు పోగుచేసి మీ దగ్గరున్న లైటర్‌తో వెలిగిద్దాం మంట లేవగానే పారిపోతుంది పులి! మనకి దారి సుగమం అవుతుంది. ఏమంటారు?" అన్నాడు కేశవ్.

"గుడ్ అయిడియా! చప్పుడు కాకుండా చితుకులు పోగుపెడదాం" అన్నాడు కరుణాకర్.

అడవిలో ఎండుపుల్లలకి కొదవేమిటి? పదినిమిషాల్లో పేర్చి మంట పెట్టారు.

పెద్దపులి ఒక్కసారిగా లేచి నిల్చున్నది! గుర్రుమన్నది.

కేశవ్‌కి, కరుణాకర్‌కి టెన్షన్‌తో నాలుక పిడారి పోయింది. అంత చలిలోను ముచ్చెమటలు పోశాయి. అది యెగిరి తమమీదికి దూకితే....!? తమకి తప్పించుకోవటానికి మరో దారి లేదు.

పులి వాళ్ళూహించినట్టు మంట చూసి పారిపోలేదు సరికదా, మంటవైపు అడుగులు వేస్తూ వస్తోంది.

ఇద్దరూ ఆశ్చర్యంతో ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. తమ అంచనా ఘోరంగా తప్పింది.

కరుణాకర్ వెంటనే ఓ నిర్ణయానికొచ్చేశాడు.

"కేశవా, అది మేనిటర్‌లా వుంది. అందుకే నరవాసన తగలగానే ఇలా వస్తోంది. సాధారణమైన పెద్దపులి అయితే యీ పాటికి మంటచూసి పారిపోయుండేది. హరియప్! యీ పక్కనున్న మఱ్ఱిచెట్టు యెక్కుదాం" అంటూ ఒక్క అంగలో మఱ్ఱిచెట్టు పక్కకు ఉరికి పైకి ఎగ్రబాకసాగాడు.

కేశవ్‌కి చెట్లెక్కటం సరిగా రాదు___అందుకే అతను నేలబారుగా వేలాడుతున్న ఊడలు పట్టుకుని పైకి

యెగబాకాడు — కాని సరిగ్గా అప్పుడే పులి గుండెలవిసేలా గాండ్రించి, వాళ్ళిద్దరి మీదకు లంఘించింది.

అప్పటికి కరుణాకర్ చెట్టు కొమ్మమీదికి యెక్కేశాడు. కాని కేశవ్ మాత్రం ఊడలు పట్టుకుని వేలాడుతూనే వున్నాడింకా.

పెద్దపులి చెట్టుకిందికి వచ్చేసింది. నేలమీది నుంచి గుర్రుపెడుతూ యెగిరి కేశవ్‌ని అందుకోబోతున్నది. కేశవ్‌కి టెన్షన్ అధికమయింది. అయినా తొందరపడలేదు. నిదానంగా పైకి యెగబాకటానికే ప్రయత్నం చేశాడు. పట్టు జారిపోకుండా ఫర్మ్‌గా పట్టుకున్నాడు ఊడని. అదే అతడి ప్రాణం కాపాడింది!

ఈలోపల కరుణాకర్ పైనుంచి తలకిందులుగా వాలి చేతులు అందించాడు సర్కస్‌లోలాగా. ఆ చేతుల్ని పట్టుకొని ఓ చేత్తో వూడని గట్టిగా పట్టుకొని పైకి యెగబాకి కొమ్మనందుకున్నాడు కేశవ్.

నేలమీద పెద్దపులి నిప్పులుతొక్కినట్టు చిందులు వేస్తోంది. గుర్రుమంటూ ఘూర్ణిల్లుతోంది. ఏమాత్రం అందినా కేశవ్‌ని చీల్చేసివుండేది!

కేశవ్, కరుణాకర్ గుబురుగా వున్న కొమ్మల మధ్య కాసేపు సేదతీరేవరకు కూర్చున్నారు. వాళ్ళు పైన కూచుంటే కింద పులి తాపీగా మళ్ళీ నేలమీద బైఠాయించింది, యెదురుగా వున్న ఆహారాన్ని వదులుకోవటానికి యిష్టం లేనట్టు.

కేశవ్, కరుణాకర్ మరోసారి దాని ప్రవర్తనకి విస్తుపోయారు.

“ఇదేమిటి, యిలా అయింది? మనం యిక్కడ్నుంచి ఒక్క అంగుళం కూడా కదల్లేం. అవతల పన్నెండు

గంటలకు జరగబోయే ఘోరాన్ని ఆపగలమా? చేతే తులా కుమార్‌ని బలిచేసుకోవటమేనా? కుమార్‌తో పాటు అన్నయ్యని కూడా చంపేస్తారు, అనుమానం లేదు!” కేశవ్ గొంతు వణికింది.

కరుణాకర్ యేదో చెప్పబోయాడు. సరిగ్గా అప్పుడే ఓ లేళ్ళ జంట చెలగాటాలాడుకుంటూ అటు పరుగెత్తుకొని వచ్చింది.

పెద్దపులి తన సైజగుణాన్ని వెంటనే చూపించుకుంది. ఒక్కసారిగా లేచి ఆ లేళ్ళ జంటమీదికి లంఘించింది. కడుపునిండా తిన్నా కూడా పులి వేటాడి చంపటం మానదు! మాంసాన్ని దాచుకుని కుళ్ళబెట్టుకుని తినటం దాని కలవాటు!

కరుణాకర్ పులి లేళ్ళ వెంట పరుగెత్తటం చూసి “కిందకు దూకేద్దాం. అది మళ్ళీ చెట్టుకిందికి వచ్చేసరికి మనం ఈ పరిసర ప్రాంతాల్లో ఎక్కడా వుండకూడదు” అన్నాడు.

ఇద్దరు ఊడలు పట్టుకుని నేలమీదికి జారిపోయి, పరుగందుకున్నారు. కాలిబాట నిదానంగానే వున్నది. దారిలో ముళ్ళకంచెలు గీరుకున్నా, ఛురకత్తుల్లా లేచి వున్న రాళ్ళ మొనలు గుచ్చుకున్నా వాళ్ళు లెక్క చేయలేదు.

అయితే వాళ్ళింకా కొన్ని గజాలు పరుగుత్తారో లేదో వెనుక నుంచి పులి గాండ్రింపు వినిపించింది.

కరుణాకర్ ముందుకు పరుగెడ్తూనే, “పులి మన జాడ పసి గట్టేసింది. ఇక ఎంతసేపో మనం పరుగెత్తలేక పోవచ్చు. ఇదిగో కత్తి. చెరోక కత్తి పట్టుకుని పులిమీద తిరగబడటం ఒకటే తరుణోపాయం! చావు ఎలాగూ

తప్పదని తెలిపోయాక, దాంతో ప్రాణంకోసం పోరా డుతూ చద్దాం" అన్నాడు సంచిలోంచి కత్తులు రెండూ పైకితీసి.

ఇద్దరికోనూ తెగింపు వచ్చేసింది.

చేతో కత్తి పట్టుకున్నారు.

పులి గాండ్రింపు మరింత దగ్గిరపడింది.

వాళ్ళిద్దరు ఆగిపోలేదు. తమ శక్తికొలదీ ముందుకు పరుగెడుతూనే వున్నారు.

# 10

"చూశావా, అందుకే అది నీకు చేతగాని పనని, మొదలకుండా యింటికి తిరిగి వెళ్ళిపొమ్మనీ చెప్పాను. కాని, నా చేత ఆమాట కాస్తా పలికించావు. నీకు బంగారం కావాలి. కాని, అందుకు రక్తతర్పణం చెయ్య టానికి మాత్రం సిద్ధంగా లేవు. ఈ మాత్రానికి ఎందుకు, గొప్పగా 'మీ మాట శిరసావహిస్తాను' అంటూ ప్రగ ల్భాలు పలికావు. నీకీ జన్మలో బంగారంచేసే విద్య పట్టుబడదు" అన్నాడు సిద్ధుడు కోపంగా.

జయరాం దిగ్భ్రాంతినుంచి యింకా తేరుకోలేదు. కొడుకును బలిచ్చే తండ్రి వుంటాడా? ధనంకోసం అంత నీచానికి, ఘోరానికి దిగజారే తండ్రి యెవడూ వుండడు. ఉన్నా ఒక్కగా నొక్క బిడ్డను చేజేతులా చంపుకునే కిరాతకుడు కాదు తను!

అతనికి ఒకటొకటిగా సిద్ధుడి చర్యలు గుర్తొచ్చాయి.

ఇదంతా ఓ ప్లాన్ ప్రకారం జరిగినట్టుగా అనిపిస్తోంది. నిజానికి యీ సిద్ధుడికి బంగారం తయారుచేసే విద్య తెలిసి వుండదు. తనని మధ్య పెట్టి, కుమార్‌ని యిక్కడికి రప్పించటానికి పన్నిన పన్నాగం అది!

కావాలంటే తనకి తెలియకుండా కుమార్‌ని యీ సిద్ధుడి మనుషులే యెత్తుకుని రావచ్చును కదా! తనని ఎందుకు ఎన్నుకున్నట్టు? తనయితే యెవరికీ అనుమానం రాకుండా తేగలడని తనని నియోగించి వుండాలి!

బంగారం భ్రాంతిలో తను పూర్తిగా మునిగిపోయి, కళ్ళు మూసుకుపోయి స్వామి ఆడించినట్లల్లా కీలుబొమ్మలా ఆడాడు. ఫలితం - కన్న కొడుకునే బలిచ్చుకోవలసి వచ్చింది.

'భగవాన్! పగవాడికూడా యిలాంటి పరిస్థితి యెన్నడూ ఎదురుకాకూడదు. ఏ తండ్రికీ తన బిడ్డని చంపుకోవలసిన గుర్తి పట్టకూడదు' మనసులోనే కుమిలి పోయాడు జయరాం.

ఏమైనాసరే తను వీళ్ళ ప్రలోభానికి లొంగకూడదు. వెంటనే కుమార్‌ని తీసుకుని యిక్కడ్నుంచి పారి పోవాలి! లేకుంటే కుమార్‌తోబాటు తనుకూడా వీళ్ళ స్వార్థానికి బలికాక తప్పదు.

బలి! అవును, ఈ సిద్ధుడు యేదో ఫలితాన్నాశించి బలికార్యక్రమాల్ని జరుపుతున్నాడన్న మాట. తను— బలిపశువుగా చిక్కాడు. వాళ్ళకి తనే కావలసివుంటే తననీ పాటికే బలిచ్చి వుండేవారు. కాదు కుమారే కావలసి వున్నా, ఈపాటికి తనని పెడరెక్కలు విరిచి కట్టి తన కళ్ళముందే కుమార్‌ని నిర్దాక్షిణ్యంగా బలిచ్చి వుండేవారు. రెండూ జరగలేదు అంటే....?!

అతనికి అర్థం అయ్యీ కాకుండా వుంది. బలివ్వటం ఒక్కటే వాళ్ళ ధ్యేయంకాదు. మరేదో వుంది.

ఏమిటది?!....

తట్టింది! తన చేతుల్తోనే తన కొడుకును బలివ్వటం

వీళ్ళ ధ్యేయం. అవును, ఖచ్చితంగా అదే! అందుకే తనని బంగారం ప్రలోభంతో కన్నకొడుకునే రక్త తర్పణం చెయ్యాలనే కండిషన్ మీద ప్రేరేపించబోయారు.

అంటే, వీళ్ళ నమ్మకాల ప్రకారం తండ్రి తన స్వహస్తాలతో కన్నబిడ్డని దేవికి బలివ్వాలేమో! అప్పుడు ఆ సిద్ధుని క్షుద్ర కోరిక ఏదో తీరి అతనికావలసిన శక్తులేవో సిద్ధిస్తాయేమో! అందుకే ఈ తంతంతా జరిపించి వుంటాడు.

జయరాం పిడికిళ్ళు కోపంతోను, ఉక్రోషంతోను, ప్రతీకార వాంఛతోను బిగుసుకున్నాయి. ఈ స్వామి యెంత నాటకమాడాడు? తను యెంత తేలిగ్గా వీళ్ళ ప్రభావంలో యిరుక్కుపోయాడు!? ఏమయినా సరే, వీళ్ళ నెదిరించయినా సరే, యిక్కడ్నుంచి తప్పించుకుపోవాలి!

"ఏం మాట్లాడవు? రక్త తర్పణ చేస్తావా, లేదా?" హుంకరించాడు స్వామి. అతని వదనంలో యిప్పుడు ప్రశాంతత, ఆప్యాయత, చల్లదనం లేవు. కళ్ళు రక్తాన్ని వర్షిస్తున్నాయి. ముఖంలో క్రూరత్వం పైశాచికత్వం నాట్యం చేస్తున్నాయి. నరరూప రాక్షసుడిలాగా, పీనుగులను పీక్కుతినే రాబందులాగా, క్రూరంగా వున్నాడు. అంతకన్న క్రూరంగా మాటల పిడుగుల్ని వర్షిస్తున్నాడు.

"క్షమించండి స్వామీ! అది నావల్ల కాదు. నాకు బంగారం అక్కర్లేదు. నాకు కన్న కొడుకును చంపుకోవటం చేతకాదు. నన్నొదిలెయ్యండి. ఇష్టంలేకపోతే ఇంటికి తిరిగిపొమ్మన్నారుకదా, వెళ్ళిపోతాను" అన్నాడు

జయరాం.

సిద్ధుడు వికటాట్టహాసం చేశాడు. "ఎక్కడికి పోతావు? నిన్నంత తేలిగ్గా వదులుతాననుకున్నావా? నిన్ను వదిలి పెట్టడానికేనా నాలుగు రోజులున్నుంచి యింత శ్రమ తీసుకున్నది? నీచేత రక్తతర్పణం చేయించితీరాను. అందుకు నువ్వు ఒప్పుకోకుండా బెట్టుచేశావంటే నేనే మీ ఇద్దరి రక్తంతో దేవతకి విందు చేస్తాను.

నీ బిడ్డను నేను చెప్పిన ప్రకారం బలిచ్చేస్తే, నీ ప్రాణాలు దక్కుతాయి. మూర్ఖంగా ఎదురుతిరిగితే ఇద్దరి ప్రాణాలు గాల్లో కలిసిపోతాయి. వెంటనే నీ నిర్ణయం చెప్పు! పుణ్యకాలం యిక కొద్ది నిమిషాలు మాత్రమే మిగిలి వుంది. ఈ ముహూర్తం తప్పితే మళ్ళీ ఓ నెల ఆగాల్సి వుంటుంది. అమావాస్య నెలకి ఒకసారే వచ్చేది!" తొందర చేశాడు సిద్ధుడు.

జయరాం మనసు భగ భగ మండిపోతున్నా సౌమ్యంగానే సమాధానం చెపుతున్నాడు.

ఎదురు తిరిగి ప్రాణాలతో బయటపడటం చాలా కష్టం. నలుగురు పోతరించిన ఎనుబోతుల్లాంటి ఆటవికులు విచ్చుకత్తులతో తనవైపే దృష్టిని కేంద్రీకరించి చూస్తున్నారు. సిద్ధుడి కనుసైగయితే చాలు నాలుగు కత్తులు తన శరీరాన్ని తుత్తునియలు చేసి రక్తాన్ని వరదలుగా పారిస్తాయి. అందుకే స్వామిని మభ్యపెట్టో నచ్చచెప్పో బయటపడాలి!

"స్వామీ! ఎంత చెడ్డా కన్న తండ్రిని కదా! కడుపు తీసి చంపుకోలేను. కన్న కొడుకును చంపుకోవటం నావల్ల కాదు. నా కొడుకుమీది పాశాన్ని తెంచుకోగలను గాని, నా చేతులారా వాడ్ని చంపలేను."

"చంపటం కాదు—రక్త తర్పణ చేయటం! అమ్మ వారు అనుగ్రహిస్తూంది. నీవు కావలసినంత బంగారం చేనిస్తాను. రాగినుంచి తయారు చేసి కాదు, నిజమైన మేలిమి బంగారం! నువ్వు బతికున్నంత కాలం మహారాజ వైభోగంతో బతకటానికి కావలసినంత బంగారమిస్తాను. అయితే నీ చేతుల్తో నువ్వే నీ కొడుకును నరకాలి. అదీ నిబంధన!"

జయరాంకి అంతవరకు యే మూలో చిన్న అనుమాన ముంటే అది కాస్తా తీరిపోయింది.

తను ఊహించింది కరెక్టే! తన చేతుల్తో తనే తన బిడ్డను బలివ్వాలన్నది కండిషన్! వాళ్ళ పద్ధతి ప్రకారం తను ఈ బలి కార్యక్రమాన్ని తన చేతుల మీదుగానే నిర్వహించాల్సి వుందన్నమాట!

"ఆలస్యమవుతున్నది, వెంటనే తెముల్చాలి. పుణ్య కాలం మించిపోతోంది" తొందర చేశాడు సిద్ధుడు.

"స్వామీ, ఎంత సరిపుచ్చుకుందామనుకున్నా నా మనసంగీకరించటంలేదు. ఈ పని నావల్ల కాదు" మొండి ధైర్యంతో తెగించి చెప్పేశాడు జయరాం.

స్వామి అతిన్ని వేగంగా సమీపించి రెండు చెంపలు చెళ్ళుమనిపించాడు.

"ద్రోహీ! నన్నే ఎదిరిస్తావా? ఇందుకు శిక్ష అనుభ వించటానికి సిద్ధంగా వుండు! నాతో పంతంపట్టి బతికి బట్టకట్టిన వాడెవడూ లేడు! ఆ కాగడాలు చూడు! వాటి వెలుగును యిక నువ్వు చూడలేవు. ఎందుకంటే వాటితో నీ రెండు కళ్ళు పొడిచేస్తున్నాను కదా!" అంటూ కాగడాలు రెండూ రెండు చేతుల్లోకి తీసు కున్నాడు స్వామి నిత్యానంద.

# 11

పులి బాగా దగ్గర పడిపోయింది.

ఆ పాటికి కరుణాకర్, కేశవ్ బాగా అలసి పోయారు. కాళ్ళకి చెప్పులున్నా, ముళ్ళు, రాళ్ళు వాళ్ళ మోకాళ్ళవరకు గాయాలు చేశాయి.

హడావిడిలో కేశవ్ యేదో మెత్తని వస్తువుమీద కాలువేసి, అది పాము అని గ్రహించి కెంబేలెత్తి పోయాడు. కాని అదృష్టవశాత్తూ అది కాటందుకోలేదు. బెదిరిపోయి పారిపోయుంటుంది.

కరుణాకర్ పరిస్థితికూడా దాదాపు యిలాగే వుంది. భుజాన బేగ్ అదనపు బరువు. ఆయాసంతో ఒగర్చుతూ పిక్కబలంకొద్దీ పరుగెడుతున్నాడు. దారి ఎగుడుదిగుడుగా వుంది. రాళ్ళు రప్పలు గుడ్డల్ని పాదాల్ని చీల్చేస్తున్నాయి. అయినా వేటినీ లెక్కచేయకుండా పరుగెడుతున్నాడు. కేశవ్‌ని హెచ్చరిస్తున్నాడు.

పులి పదిగజాల దూరంలోకి వచ్చేసింది. కరుణాకర్ ఓ నిర్ణయానికొచ్చేశాడు.

"కేశవ్, పులి వెనుకపాటున మనమీదికి దూకి చీల్చి వేసేలా వుంది. మనం తిరగబడటం తప్ప గత్యంతరం లేదు. చుట్టుపక్కల అన్నీ చెట్లే. కాని యెక్కటానికి మాత్రం కుదరలేదు. మనం వాటి చెట్టుమీదినుంచి దిగి చాలా పొరపాటు చేశాం" అన్నాడు.

కేశవ్‌లో మొండిధైర్యం, తెగింపు వచ్చేశాయి.

"ఓ.కే! ఇద్దరం చెరో పక్కనుంచి ఎటాక్ చేద్దాం. దాన్ని కన్‌ఫ్యూజ్ చేసి, మనం దానికి ఆహుతయి పోవటమో చేతనైతే దాన్ని అంతం చేయటమో తేలి పోవాలి?" అన్నాడు స్థిరంగా.

కరుణాకర్ అకస్మాత్తుగా పరుగెత్తటం ఆపేసి టార్చ్‌లైట్ సిద్ధంగా పట్టుకున్నాడు. కుడిచేతుల్లో ఇద్దరు పొడవాటి కత్తుల్తో పులిమీదకు తిరగబడటానికి తయారై నించున్నారు.

పులి రెండు గజాల దూరంలో వుంది.

కరుణాకర్ టార్చిని దాని కళ్లల్లోకి ఫోకస్ చేశాడు. పులి టక్కున ఆగిపోయింది. దాని కళ్ళు నిప్పుకణికల్లా మెరుస్తున్నాయి.

రెండు క్షణాలు మాత్రమే అలా చూసింది. ఆ తర్వాత మెరుపువేగంతో గాల్లోకి యెగిరింది. కరుణాకర్ దాని ముఖంమీదికి ఫోకస్ చేయటం మానలేదు. దాని కళ్ళల్లోకి వెలుగుపడటంవల్ల చీకట్లో వున్న వ్యక్తులమీదికి గురిగా ఎగరలేదని అతనికి తెలుసు!

అదే జరిగింది! కరుణాకర్‌కి అడుగుదూరంలో నేల మీదికి గెంతింది పులి!

అవకాశంకోసం ఎదురుగా చూస్తున్న కేశవ్ ఆ స్ప్లిట్ సెకండ్‌ని బాగా వినియోగించుకున్నాడు. బలంగా దాని డొక్కల్లో కత్తితో పొడిచాడు.

పులి బాధతో పెద్దగా గాండ్రించింది. కేశవ్ వైపు మహోగ్రంగా పంజా విసిరింది. చాలా లాఘవంగా దాని దెబ్బనుంచి తప్పించుకున్నాడు కేశవ్. పులి కేశవ్ వైపు దృష్టి మరల్చగానే కరుణాకర్ దాని మెడమీద తన కత్తితో శక్తినంతా ఉపయోగించి పొడిచాడు.

మరోసారి అడవి దద్దరిల్లిపోయేటట్టు గట్టిగా గర్జన చేసింది పులి. టార్చిలైటుని దాని కళ్లలోకి ఫోకస్ చేస్తూ దాన్ని కన్‌ఫ్యూజ్ చేసేస్తున్నాడు, కరుణాకర్. అవ

కాశం దొరికినప్పుడల్లా కత్తితో అందినచోటల్లా యిష్టం వచ్చినట్టు పొడిచేస్తున్నాడు కేశవ్. అయితే దాని పంజా దెబ్బనుంచి మాత్రం తప్పించుకోలేకపోయాడు.

కేశవ్ జబ్బమీద నిలువునా పంజాతో గీరేసింది పులి. పట్టు పీలికలైపోయి గాయమయింది. రక్తం చారలుగా చివ్వున చిందింది. బాధతో మూలిగాడు కేశవ్. కేశవ్ మీద దాడిచేసిన సమయంలో కరుణాకర్, కరుణాకర్ వైపు తిరిగినపుడు కేశవ్—దాని శరీరాన్ని తూట్లుగా పొడిచేశారు.

పులి బలం క్షీణించిపోయింది. రక్తంతో దాని ఒళ్ళంతా వరదలైపోయింది. నేల కూలిపోయి చాలాసేపు గిలగిల కొట్టుకుంది. తర్వాత దాని శరీరం చలనరహితమయిపోయింది.

కేశవ్‌కి పులి చేసిన గాయం సలుపుపెడుతోంది. కరుణాకర్ చాలా ఎలర్టుగా పోరాడటం వల్ల స్వల్ప గాయాలతో తప్పించుకున్నాడు.

ఇద్దరు బాగా అలిసిపోయారు.

కరుణాకర్ కేశవ్ జబ్బపైకి టార్చి ఫోకస్ చేసి, "గాయం బాగా లోతుగా అయినట్టుందే, బాగా బాధ పెడుతోందా?" అన్నాడు.

కేశవ్ నీరసంగా నవ్వి, "ప్రాణం దక్కింది కదా! గాయం ఎంత పెద్దదైతేనేం?" అన్నాడు.

కరుణాకర్ వాచ్ చూసుకుని "అరె, పన్నెండు దాటిపోయింది" అన్నాడు ఆందోళనగా.

కేశవ్ కూడా వాచ్ చూసుకుని, "పన్నెండు దాటి పదిహేను నిమిషాలయింది. పశుపతిగారు చెప్పిందాన్నిబట్టి సరిగ్గా పన్నెండు గంటలకే సిద్ధుడు బలికార్యక్రమం

జరపడం అనవాయితీ. ఈరోజూ అలాగే జరిపివుంటే."

తిక్కన వాక్యం పూర్తి చెయ్యలేదు. అప్పటికే అతని మనసంతా చిరాకైపోయింది. మెదడు ఆలోచించే శక్తిని కోల్పోయి మొద్దుబారిపోయింది.

కరుణాకర్ సాలోచనగా తలూపి, "మన శక్తి వంచనలేకుండా కృషి చేస్తున్నాం. మధ్యలో యీ క్రూరమృగం, మన వెంటపడి వుండకపోతే ఈపాటికి సిద్ధుడి గుహ చేరుకుని వుండేవాళ్ళం! ఇప్పటికైనా మించిపోయింది లేదు. కమాన్, హారియప్!" అంటూ వేగంగా ముందుకు అడుగులు వేశాడు.

కేశవ్ పులిచేసిన గాయంనుంచి రక్తం స్రవించకుండా చేతి రుమాలుతో నొక్కిపట్టి కట్టుకున్నాడు. శారీరక బాధకన్నా మానసికంగా అతను పడుతున్న బాధ వర్ణనాతీతం!

ఇద్దరు కాలిబాట వెంట నడుస్తున్నారు. పులిని చంపిన కత్తులింకా వాళ్ళ చేతుల్లోనే వున్నాయి. మళ్ళీ యేదైనా అవాంతరం యెదురయితే యెదుర్కోవాలని నిర్ణయించుకున్నారు.

బాట బాగానే కనిపిస్తోంది. కరుణాకర్ టార్చ్‌తో ముందున్నాడు. అతన్ని వెన్నంటి కేశవ్ నడుస్తున్నాడు.

ఇద్దరు ఓ యాభై గజాలు నడిచారు నిర్విరామంగా. కొండగుహాల జాడ ఎక్కడా కనిపించటంలేదు. పశుపతి మాటలు మళ్ళీ మననం చేసుకున్నాడు కేశవ్.

శ్వార్థ్యుని కుడి పక్కనుంచి రెండు మైళ్ళు నడవాలని చెప్పాడు. తామిప్పటివరకు నడచిన దూరం రెండుమైళ్ళకు తక్కువుండదని అంచనా వేశాడు. మరి యెక్కడా కొండగుహాల జాడ కనిపించటంలేదు.

మరో పదినిమిషాలు నడిచారిద్దరు.

సరిగ్గా అప్పుడే ఊహించని సంఘటన జరిగిపోయింది. ఏదో భీకరంగా వున్న ఆకారం చెట్టుపైనుంచి సరాసరి కరుణాకర్ మీదికి గెంతింది.

అంతే, అతని చేతిలోని టార్చి ఎగిరి అంతదూరంలో పడింది.

కరుణాకర్, కేశవ్ ఊహించని ఈ హఠాత్పరిణామానికి నిశ్చేష్టులై కొద్దిక్షణాలు కర్తవ్య విమూఢులై నిలుచుండిపోయారు.

# 12

జయరాం భయంతో, గగుర్పాటుతో రెండు కళ్ళు మూసుకున్నాడు.

స్వామి రెండు చేతుల్లోను రెండు ఖడ్గాలు పట్టుకుని అతన్ని సమీపించాడు.

"ఇప్పటికయినా మించిపోయింది లేదు. నీకు మరో అవకాశమిస్తున్నాను. ఆలోచించుకో! చేజేతులా నీ కళ్ళు పోగొట్టుకోకు. మా మాట కాదంటే ఒక్కొక్కటిగా నీ అవయవాలన్నీ ఖండించి నిన్ను చిత్రవధ చేస్తాను. నాతో శత్రుత్వం నీకు మంచిది కాదు, ఆలోచించుకో!" అన్నాడు స్వామి.

జయరాం మాట్లాడలేదు. కళ్ళు మూసుకుని తీవ్రమైన మనోక్షోభతో తలవిదిలించాడు.

స్వామి అసహనంగా చూశాడతనికేసి.

"ఏమిటి మాట్లాడవు? నా మాటలు అర్థంకావటం లేదా? నీకన్న మొండివాళ్ళను నా దారికి తెచ్చుకున్నాను. నన్నెదిరించిన వాళ్ళను నాశనం చేశాను. వాళ్ళ కపాలాలు అమ్మ మెడలో హారంగా గుచ్చి

వేశాను. నీకూ యిప్పుడదే గతి ప్రాప్తించబోతోంది" హెచ్చరించాడు.

అప్పటికీ ఏం మాట్లాడలేదు జయరాం. ఈ పరిస్థితి నుంచి యెలా బయటపడాలా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

స్వామి కోపంతో నేల తన్నాడు. కాగడాలతో జయరాంమీదకొచ్చాడు. మరుక్షణం అతని రెండు కళ్ళను పొడిచేసి వుండేవాడు.

సరిగ్గా అప్పుడే గుండెలవిసిపోయేలా పెద్దపులి ఆర్తనాదం వినిపించింది. ఒకసారి కాదు, వరసగా చాలా సార్లు.

స్వామి చేస్తున్న పని ఆపేసి నిల్చుండిపోయాడు. ఎవరో పెద్దపులిని వేటాడుతున్నారు, అనుమానంలేదు. అర్ధరాత్రి సమయంలో అడవిలో యెవరు ప్రవేశించారు? శత్రువులా? అయితే ఎవరు?

స్వామి రెండు నిమిషాలు యేదో దీర్ఘాలోచనలో పడిపోయాడు. కాగడాలు కోయ నాయకులకు తిరిగిచ్చేశాడు.

"మీరిద్దరు వెళ్ళి అదేమిటో చూసి రండి! తక్కిన యిద్దరు యిక్కడే వుండండి!" అన్నాడు స్వామి. అతని మనసేదో కీడు శంకిస్తోంది.

నలుగురు కొండ నాయకుల్లో ఇద్దరు వెంటనే కాగడాలు చేత ధరించి బయలుదేరారు.

జయరాం కూడా స్పష్టంగా పులి గాండ్రింపులు విన్నాడు. ఎవరై వుంటారు? ఈ అర్ధరాత్రి పులిని వేటాడే వాళ్ళెవరుంటారు?

ఈ సందర్భంగానైనా తన మీద స్వామి దాడి

తాత్కాలికంగా ఆగిపోయింది. లేకుంటే ఈపాటికి తన రెండు కళ్ళు పాడిచేసి తనని శాశ్వతంగా అంధుడిగా మార్చేసి వుండేవాడు.

ఇప్పుడైనా వదుల్తాడనే నమ్మకం లేదు. తన అంతం చూడకుండా విడిచిపెట్టడు. ఏం చెప్పి ఇతన్ని నమ్మించ గలడు?

జయరాం మనసునిండా కందిరీగల్లాంటి ఆలోచనలు ముసురుకుంటున్నాయి. ఓ పక్క దర్భాసనం పరచిన బండమీద కుమార్ గాఢ నిద్రలో వున్నాడు. ఆ పసి వాడి ముఖం చూస్తుంటే గుండె తరుక్కుపోతోంది జయరాంకి.

తన స్వార్థంకోసం ఓ క్రూరాడి జీవితాన్ని నాశనం చేశాడు తను. ప్రాణాలతో బయటపడటం జరిగే పనిలా అనిపించటం లేదు.

స్వామి తనకంకే సూటిగా చూస్తూన్నాడు.

తను యెలాగైనా ఒప్పుకుంటాడనే ధీమాతో వున్నా డతను. తను అంగీకరించకపోయినా, తనని చంపకుండా వదలడనదే నిర్వివాదాంశం! తను అతన్నుంచి, ఆ ఆటవిక నాయకుల బారినుంచి తప్పించుకుని యీ కీకారణ్యంలో పదిగజాలు కూడా వెళ్ళలేను.

పులిబోనులో తల పెట్టాడు. బయటపడటం మాత్రం కల్ల! తిరగబడితే....!? తనదగ్గిర యెలాంటి ఆయుధమూ లేదు. తిరగబడిన మరుక్షణం వాళ్ళు తనని నిర్దాక్షిణ్యంగా చంపేస్తారు.

ఎలా? ఎలా తప్పించుకోవటం?

జయరాం కళ్ళకి కోయ నాయకుల బరిసెలు కనిపి స్తున్నాయి. ఓ పక్కగా కొండగుహలో బండలను చేర్చి

నిలబెట్టి వున్నాయి. వాటిల్లో ఓ దాన్నందుకుని నిత్యానందస్వామిని ఒక్కసారిగా పొడిచిపారేస్తే....?! అనిపించిందో క్షణం.

కాని, ఆ మరుక్షణమే ఆటవికులు తనని యేకీలు కాకీలు విరిచేస్తారు. తనేం సాధించినట్టు?

నిత్యానందస్వామి అనిశ్చితంగా గుహలో పచార్లు చేస్తూ జయరాంవైపు సూటిగా చూసి "నీకిచ్చిన వ్యవధి అయిపోయింది. ఇంతకన్న ఓర్మ వహించలేను. ఏం నిర్ణయించుకున్నావు?" అన్నాడు.

జయరాం వెంటనే మాట్లాడలేదు.

నిత్యానందస్వామికి ఛర్రున కోపం వచ్చేసింది. ఓ బండమీద సిద్ధంగా వున్న వేటకత్తిని అందుకున్నాడు. విసురుగా జయరాంమీదికి లంఘించాడు. మరుక్షణం అతని తల ఎగిరి అవతల పడివుండేదే!

కాని, ఈలోపల ఊహించని అద్భుతం జరిగిపోయింది.

గుహ ముఖద్వారం దగ్గర కాగడాలతో కావలివున్న ఆటవిక నాయకు లిద్దరు పెడబొబ్బలు పెట్టారు, ముందు వాళ్ళ ఆర్తనాదాలు, ఆ వెంటనే సింహగర్జన వినిపించాయి.

స్వామి తత్తరపాటుతో చూశాడు బయటికి. ఓ ఆటవిక నాయకుడు నేలమీద కొరిగిపోయాడు. వాడి చేతిలోని కాగడా యెగిరి అల్లంతదూరంలో పడింది. సింహం వాడి గుండెలు చీల్చేసింది. ఈలోపల రెండో నాయకుడు బరిసెతో సింహంమీదికి లంఘించాడు.

సింహం మహోగ్రంగా గర్జించి, రెండో నాయకుడి కంఠం కొరికేసింది. పెద్ద వెర్రికేక వేసి కాగడాను,

బరిసెను వదిలేసి నేలమీద నిలువునా పడిపోయాడు. సింహం అతన్ని నోట కరుచుకుని పొదల మధ్యకు చెంగున దూకి క్షణాల్లో మాయమైపోయింది.

నిత్యానందస్వామికి నోట మాట రాక అలాగే నిల్చుండిపోయాడు. అతని చేతిలోని వేటకత్తి అంతకు ముందే నేల జారిపోయింది.

కాగడాలు యెగిరి అవతలపడటంతో గుహలో వెలుతురు లేకుండా పోయింది. సరిగ్గా ఆ అవకాశాన్ని తనకు అనువుగా మలచుకున్నాడు జయరాం. మెదలకుండా కొడుకును లేవదీసి భుజాన వేసుకుని చప్పుడు కాకుండా బయటకు. పిల్లికన్న మెత్తగా అడుగులు వేసుకుంటూ తప్పించుకుని పారిపోయాడు.

దూరంగా కాగడాల వెల్తురు కనిపించింది.

అంతే. పులిని వేటాడుతున్న వాళ్ళను చూడటానికి వెళ్ళిన యిద్దరు అనుచరులు తిరిగివస్తున్నారన్న మాట.

కాగడాల వెల్తురు బాగా దగ్గరయ్యింది.

గుబురుగా వున్న పొదల చాటుగా నక్కి కూచున్నాడు జయరాం.

ఆటవిక నాయకులు సరాసరి గుహలోపలికి వెళ్ళారు. చచ్చిన సహచరుల్ని చూశారు.

ఏదో అనబోతుండగా లోపల్నుంచి సిద్ధుడు గట్టిగా అరిచాడు.

"వాడు తప్పించుకుని పారిపోయాడు. మనవాళ్ళ నిద్దర్ని చంపేసి పారిపోయాడు. పిల్లగాడి నెత్తుకుని మరీ పోయాడు. వాడ్ని పట్టుకోండి. ప్రాణాలతో నయినా సరే. శవాలనయినా సరే—పట్టుకోండి. వెళ్ళండి!"

ఆటవిక నాయకులకి మరేమీ ఆలోచించాల్సిన అవ

పరం లేకపోయింది.

కొండదేవతకు మమ్మారు స్మరించుకుని, నాగదాలు ఓ చేత, బరిసెలు మరో చేత ధరించి పెద్దగా సింహనాదాలు చేసి ఒక్కసారిగా అడవిలోకి పరుగులు తీశారు.

వాళ్ళు బాగా దూరంగా వెళ్ళిపోయేవరకు పొదల్లోనే తలదాచుకుని, తర్వాత పైకి లేచాడు జయరాం కుమార్ ని జాగ్రత్తగా భుజంమీదకు యెత్తుకుని పాదివి పట్టుకున్నాడు

కటిక చీకటి' పక్కన యేముందో యెదురుగా యేముందో కనిపించటంలేదు. అప్పటికి చీకటికి కళ్ళు అలవాటుపడ్డా స్పష్టంగా యేదీ కనిపించటంలేదు.

జయరాం మొండిధైర్యంతో ముందుకు పరుగుతీశాడు. అడుగుతీసి అడుగు వెయ్యటమే కష్టంగా వుంది. పరుగు పెట్టడం సాధ్యంకాదని రెండు నిమిషాల్లోనే అర్థమైపోయింది.

సరిగ్గా అప్పుడే పొదల్లో యేదో చప్పుడయ్యింది. ఏదో జంతువు మసలుతున్న సూచన! స్పష్టంగా వినిపించింది జయరాంకి.

అతని గుండె ఒక్కక్షణం ఆగి మళ్ళీ కొట్టుకున్నది. సింహమా? పెద్దపులా? మరో క్రూరమయిన జంతువా? యే క్షణంలోనయినా తన మీదకు దాడి చేస్తుందేమో ....!?

ఇప్పుడెలా?

జయరాం కదలక మెదలక అలాగే నిల్చుండిపోయాడు. భుజంమీద కుమార్ కదులుతున్నాడు.

# 13

కొద్ది క్షణాల వరకు తమమీదికి దూకినదేదో అర్థం కాలేదు కరుణాకర్, కేశవ్ లకు.

టార్చి దూరంగా పడిపోయినా వెలుతురు నేలమీద అటు యిటు ప్రసరిస్తూనే వుంది. కరుణాకర్ కన్నా ముందే కేశవ్ ఆ ఆకారాన్ని గుర్తించాడు. మనిషిలాగే వుంటే చింపాంజీయా? అనుకున్నాడు. కాని కాదని మరుక్షణమే నిర్ధారణయింది.

అది గొరిల్లా. మనిషిలాగే రెండు కాళ్ళ మీద నిల్చుని గంటల తరబడి పోరాడగల జంతువు కాని జంతువు!

పెద్దపులితో పోరాడి, గాయాలతో బాధపడుతుండగానే మళ్ళీ మరో జంతువుతో ఆ కీకారణ్యంలో, నడిరాత్రి, చిట్టచీకట్లో ప్రాణం రక్షించుకోవటం కోసం తెగించి పోరాడవలసిన దుర్గతి పట్టినందుకు వాళ్ళిద్దరు మనసుల్లో ఓ పక్క కుమిలిపోతూనే శత్రువుతో తలపడ్డారు.

గొరిల్లా పెద్దపులిలాంటి క్రూరజంతువు కాదన్నమాటే గాని, పోట్లాట మొదలెడితే ఓ పట్టాన వదలదు!

కరుణాకర్ గొరిల్లా పట్టు వదిలించుకోవటానికి కిందమీదవుతున్న సమయంలో కేశవ్ దాన్ని నడుముమీద, పక్కల్లోను కత్తితో బలంగా పొడిచాడు.

సరిగ్గా పట్టు దొరికివుంటే పళ్ళతో కరుణాకర్ గొంతు కొరికేసి వుండేది గొరిల్లా. కాని, కేశవ్ కత్తి పోట్లనుంచి తప్పించుకోవటం కోసం కరుణాకర్ ని వదిలేసింది. మహాకోపంతో ఘూర్ణిల్లుతూ కేశవ్ మీదికి ఉరికింది. చేతులు చాచి తన ఇనుపపంజాల్లో ఇరికించి నుగ్గు

చేసేద్దామన్నంత వేగంగా మీది మీది కొచ్చింది విక్ర తంగా అరుస్తూ.

ఈసారి ఛాన్స్ కరుణాకర్ తీసుకున్నాడు. గొరిల్లా ఉరికినపుడు దూరంగాపడిపోయిన కత్తిని అందుకున్నాడు' టార్చిలైటును కూడా తీసుకున్నాడు. వెనుకపాటున వెళ్ళి కత్తితో దాని కాళ్ళ మధ్యన చాచిన చేతులమీద బలంగా పొడిచాడు.

గొరిల్లా అమాంతం నేలమీద పడిపోయింది. కేశవ్, కరుణాకర్ అది చచ్చేవరకు కత్తులతో పొడుస్తూనే వున్నారు.

గొరిల్లా ఆఖరి శ్వాస వదిలేసింది.

అప్పటికి కరుణాకర్, కేశవ్ పూర్తిగా నీరసించి పోయారు. నేలమీద చతికిలబడిపోయారు ఆయాసంతో. గొరిల్లాతో పోరాటంలో కరుణాకర్ దుస్తులు చీలికలు పేలికలై పోవటమే కాక, శరీరంమీద చాలాచోట్ల గాయాలయినాయి.

దాహంతో యిద్దరి నోళ్ళు పిడచకట్టుకు పోయాయి. కరుణాకర్ అంత బాధలోను లేచి దూరంగా పడి పోయిన ఏర్ బ్యాగ్ నుంచి చెదిరిపడిపోయిన వాటర్ బ్యాగ్‌ని వెతికి తెచ్చాడు. ఇద్దరూ ఆత్రంగా నీళ్ళు తాగారు.

కొంత శక్తి వచ్చినట్టుగా అనిపించింది.

కరుణాకర్ నోరు తెరిచి యేదో అనబోయాడు. కాని, అదే సమయానికి రెండు కాగడాలు వాళ్ళకి అతి సమీ పంలో ఇటే వస్తూ కనిపించాయి.

ఇద్దరూ ఊపిరి కూడా విడువటం మానేసి అటే చూస్తూన్నారు.

అంతకంతకు ఆ కాగడాలు తమకి అతి సమీపంగా రావటం గమనించిన కేశవ్, "ఎవరో యిద్దరో అంతకన్న యెక్కువమంది వ్యక్తులు యిటే వస్తున్నారు. మనం సురక్షిత స్థానాన్ని వెతుక్కోవటం మంచిది....!" అన్నాడు.

కరుణాకర్ టార్చి ఆఫ్ చేసేశాడు.

"సురక్షిత స్థానమంటూ యేదీ లేదు. చెట్టెక్కటం తప్ప మరో మార్గం లేదు" అన్నాడు.

ఇద్దరూ, యిందాకా గొరిల్లా దూకిన చెట్టుమీదికి ఎగ బాకారు.

సరిగ్గా అప్పుడే కాగడాలతో కోయ నాయకులు అక్కడికొచ్చారు. వాళ్ళు సిద్ధుడు పంపిన నలుగురు నాయకుల్లోని యిద్దరు!

సరిగ్గా కరుణాకర్, కేశవ్ లున్న చెట్టుకిందికే వచ్చారు. కాగడా వెలుగు ఆ చుట్టుపట్ల యిరవై మూడు గజాలవరకు వున్న దృశ్యాల్ని స్పష్టంగా కని పింపచేస్తున్నది.

ఆ వెలుగులో చచ్చిన గొరిల్లా కనిపిస్తోంది, చాలా భయంకరంగా రక్తపుమడుగులో.

అందులో ఒకడన్నాడు: "పులి జంపేసినట్టుందాది. మనం యిన్న గాండ్రింపు ఆ పులిదే. లగెత్తూ అయ్యోరికి సెప్పాల" అంటూ రెండోవాడితో పాటు మళ్ళీ వెను దిరిగి వెళ్ళిపోవటానికి సిద్ధమయ్యాడు.

రెండోవాడు పులి అడుగుజాడల కోసమో ఎందుకో కాగడాతో నేలమీద కాసేపు వెతికాడు. తర్వాత తలూపి, "పా, పోదం" అన్నాడు.

ఇద్దరూ వెళ్ళిపోయేవరకు కరుణాకర్, కేశవ్ లు

ఊపిరి కూడా విడవకుండా అలాగే చూస్తున్నారు.

కరుణాకర్ కేశవ్ వైపు తిరిగి, "వాళ్ళ మాటల్నిబట్టి పులి గర్జన విని వచ్చినట్టుంది కదూ! అఘోరం కూడా ఆ నిత్యానందస్వామి కావచ్చు. పశుపతిగారు చెప్పారు కదా సిద్ధుడ్ని ఆటవికులు సాములోరని, అఘోరనీ పిల్చుకుంటారని!" అన్నాడు.

కేశవ్, "అవును. మనం వాళ్ళిద్దర్ని ఫాలో అయి వస్తే సిద్ధుడి గుహకి సరాసరి వెళ్ళిపోవచ్చు. అన్నయ్యని కుమార్ని అక్కడే అట్టిపెట్టి వుంటాడు సిద్ధుడు. దిగుదామా?" అన్నాడు.

కరుణాకర్ తలూపాడు.

ఇద్దరూ చెట్టుదిగి, వేగంగా కాగడాల జాడనిబట్టి వాళ్ళను అనుసరించి వెళ్ళారు. దూరంగా కొండగుహలు కన్నులపండువు చేస్తూ కనిపించాయి.

"అవిగో, కొండగుహలు!" ఆనందంగా అరవబోయాడు కేశవ్.

కరుణాకర్ మృదువుగా అతని చేతిని నొక్కాడు, ఎగ్జయిట్ కావద్దని.

కొండగుహ ముఖద్వారం దగ్గర వచ్చిపడున్న ఆటవికుడు వాళ్ళ దృష్టిలో పడ్డాడు. లోపల్నుంచి సిద్ధుడు అరుస్తూన్న మాటలు అతి స్పష్టంగా వినిపించాయి.

"........పిల్లగాడిని ఎత్తుకుని మరీ పారిపోయాడు. వాడ్ని పట్టుకోండి. ప్రాణాలతోనైనా సరే, శవాలైనాసరే—పట్టుకోండి, వెళ్ళండి!"

ఆ మాటలు వింటూనే ఆటవిక నాయకులిద్దరూ అతి వేగంగా బయటకు పరుగెత్తుకుని రావటం కనిపించింది.

కరుణాకర్, కేశవ్ ఆనందంతో ఒకరినొకరు కర

చాలనం చేసుకుని, ఆలింగనం చేసుకున్నారు. జయరాం, కుమార్‌తో బాటు తప్పించుకుని పారిపోయాడని అర్థమై పోయింది యిద్దరికీ. పులి, గొరిల్లాలవల్ల అయిన గాయాల బాధ చేత్తో తీసేసినట్టుగా ఫీలయ్యారిద్దరూ.

కాని, అంతలోనే ఆ ఆనందం ఎగిరిపోయింది. ఆట వికులు కాగడాలతో, బరిసెలతో అడవిలో పరుగులు పెడుతూ వెళ్తూన్నారు.

జయరాం అడవికి కొత్త. ఆటవికులు పుట్టి పెరిగింది అడవిలోనే. జయరాం ఎంతమాత్రం పరుగెత్తగలడు? వాళ్ళకి దొరక్కుండా ఎలా తప్పించుకోగలడు?

కరుణాకర్, కేశవ్ భుజం తట్టి, "జయరాంని వాళ్ళు పట్టేసుకోవటం ఖాయం! మనం వెంటనే అతనికి సాయంగా వెళ్ళాలి. ఈ ఆటవికుల్ని వెనుకపాటున వీలైతే దాడి చేసి చంపెయ్యాలి. హారియప్....!" అన్నాడు.

ఇద్దరూ, ఆటవికుల కాగడాలని గుర్తుగా చేసుకుని వాళ్ళు పరుగెత్తిన దిశలో తాము కూడా పరుగు పెట్టారు.

అప్పుడు రాత్రి ఒంటిగంటన్నరయింది.

## 14

జయరాం ఊపిరి కూడా పీల్చడం మరచిపోయి, టెన్షన్‌తో అలాగే కొద్ది క్షణాలు నిల్చుండిపోయాడు.

కుమార్ నిద్ర లేచి కదులుతున్నాడు. లేచి యేడుస్తా డేమో! అప్పుడు తన ఉనికి సిద్ధుడికి ఆటవికులకి తెలిసి పోవడమే కాక, పొదల్లోని జంతువు క్కూడా తెలిసి పోతుంది.

తనకి రక్షణ వుండదు!

జయరాం పాదల్లోకి కళ్ళు చిట్లించి చూశాడు. ఏదో జంతువు కదల్తూ వస్తూన్నది. దాని కళ్ళు చీకట్లో మిల మిల మెరుస్తున్నాయి.

జయరాం గుండె వేగం హెచ్చింది. క్రూరమృగాల్లాంటి మనుషుల్నుంచి రక్షించుకోవటంలో క్రూర మృగాల పాలిట చిక్కక తప్పలేదు. తనకి ఈ క్షణంతో నూకలు చెల్లిపోయినట్టే!

ఆ జంతువు కదుల్తున్న సూచనగా ఎండుటాకుల మీద చప్పుడు వినిపించింది. ఆ క్షణమో, మరుక్షణమో అది తనమీద దాడి చేస్తుంది.

ఇప్పుడు తనేం చెయ్యాలి? నిస్సహాయంగా ఆ జంతువుకి బలి కావల్సిందేనా? పోనీ, కాలు సాగించి పరుగు పెడితే....అదింకా ప్రమాదమేమో!

జయరాం డైలమాలో పడ్డాడు కొద్దిక్షణాలు.

సరిగ్గా అదే క్షణంలో ఆటవికులు పరుగుపెట్టిన దిశగా పరుగెడుతున్న యిద్దరు వ్యక్తులు కనిపించారు—జయరాంకి.

ఉలిక్కిపడి చూశాడు. తనకి బాగా పరిచయమయిన ఆకారాలు.

జయరాం ఆనందంతో పెద్దగా కేక పెట్టాలనుకున్నాడు. వాళ్ళు....కరుణాకర్, కేశవ్ యిక్కడికెలా వచ్చారు? తనని వెతుక్కుంటూ వచ్చారా?

జయరాంకి కొండంత ధైర్యం వచ్చింది. కేక పెట్టబోయేంతలో మెరుపులా మాయమైపోయారు వాళ్ళు. తను కేక పెట్టడం ప్రమాదకరం కూడా. సిద్ధుడికి వినిపించే అవకాశముంది. అయినా తన పిలుపు కందేంత సమీపంలో లేరు వాళ్ళు.

చేతి కందినట్టే అంది చేజారిపోయిన అవకాశాన్ని తలుచుకుని కొద్దిక్షణాలు బాధపడ్డాడు జయరాం. అంతలోనే పొంచివున్న ప్రమాదం గుర్తొచ్చింది.

పాదలవైపు పరిశీలనగా చూశాడు.

చిత్రం! అక్కడ తానిదివరకు చూసిన జంతువు లేదు. ఎటో పోయినట్టుంది.

బలంగా ఊపిరి పీల్చి వదిలాడు జయరాం.

తన ఉనికి కేశవ్ కి, కరుణాకర్ కి యెలా తెలియచేయటం? తనని వెతుక్కుంటూ వచ్చి ఆటవికుల చేతుల్లో చిక్కుకపోయేలా వున్నారు.

వాళ్ళసలే కర్కశులు. తనమీది కోపంతో వాళ్ళని చంపేస్తారు. జాలి, దయ, కరుణ అన్న పదానికి అర్థం తెలియని అనాగరికులు. స్వామి చేతుల్లో కీలుబొమ్మలు. ఏం చేసినా చెయ్యగలరు. వాళ్ళ నాపగలిగే వాళ్ళు గాని, వాళ్ళనుంచి తప్పించుకోగలవాళ్ళు గాని యెవరూ లేరు.

కేశవ్, కరుణాకర్ పులి బోనులో తల పెట్టేశారు. వాళ్ళు తనని రక్షించటం మాట దేవుడెరుగు, తనిప్పుడు వాళ్ళనే రక్షించాల్సిన అవసర మేర్పడింది.

కుమార్ పూర్తిగా మెలకువలోకి వచ్చాడు. "డాడీ!" అంటూ నీరసంగా పిలిచాడు.

జయరాం వాడి వెన్ను నిమిరి, "నే నే బాబూ! భయంలేదు" అన్నాడు.

"చీకటిగా వుంది. భయమేస్తోంది డాడీ! మనింటికి వెళ్ళిపోదాం" కుమార్ మెల్లిగా అన్నాడు.

"వెళ్ళిపోతున్నాం బాబూ! భయపడకు. చీకటిగా వుందికదూ, దారి కనిపించటంలేదు. ఇంటికే వెళ్ళిపోదాం"

అన్నాడు జయరాం లాలనగా.

"అమ్మ కావాలి డాడీ! అమ్మని వెంటనే చూడాలి" అన్నాడు కుమార్ తండ్రి కంఠాన్ని గట్టిగా కావలించు కుని.

"వెళ్ళిపోతాంకదా. ఇంట్లో వుంది అమ్మ. త్వరలోనే అమ్మను చూపిస్తాను."

"డాడీ! ఆకలేస్తోంది."

గతుక్కుమన్నాడు జయరాం. రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో యేవో పళ్ళు పుట్ట తేసి యిచ్చాడు స్వామి తినమని. బంగారం భ్రాంతిలో వున్న తను ఆ పళ్ళు తిన లేదు. కుమార్ ఒకటో అరో తిని, తినలేనని మానే శాడు. అన్నంతినే పిల్లడిని పళ్ళతో సరిపెట్టుకోమంటే ఎలా తట్టుకోగలడు?

"కాస్సేపట్లో యింటికి వెళ్ళిపోతాం కదమ్మా! ఇంట్లో అమ్మ నీ కోసం పెరుగుబువ్వ దాచిపెట్టింది, పోయి తిందాం. సరేనా?"

కుమార్ నీరసంగా తలూపాడు. చీకట్లో జయరాంకి కనిపించలేదు. "ఏం బాబూ, సరేనా?" అన్నాడు.

"ఊఁ!" అంటూ తండ్రి కంఠాన్ని కరచుకుని అలాగే మళ్ళీ నిద్రలోకి జారిపోయాడు కుమార్.

జయరాం ముందుకి దృష్టి సారించాడు. దూరంగా కాగడాలు కనిపిస్తున్నాయి. టార్చి వెలుతురు వుండి వుండి కనిపిస్తోంది.

బహుశా కరుణాకర్, కేశవ్‌లు అయివుండాలి! వాళ్ళు ఆటవికుల్ని వెన్నంటి యెందుకు అనుసరిస్తున్నారు? తన ఉనికి తెలుసుకోటానికా? వాళ్ళ వెంట వెళ్తే తిక్క

డున్నదీ తెలుస్తూందనుకుని, ఎగురుగా వున్న కొండ గుహను గమనించకుండా ముందుకే పరుగెత్తుకుపోయారు.

జయరాం ఆలోచనలు తెగ్గొస్తూ వేటకుక్కల గుంపు అటే పరుగెత్తుతూ వస్తున్న జాడ పొడకట్టింది. అవి వేటకుక్కలేనా? అర్ధరాత్రి సమయంలో వేటాడే వాళ్ళెవరు?

కళ్ళు చిట్లించి చూశాడు. వేటకుక్కలు కాదు.

తోడేళ్ళ గుంపు!

జయరాం గుండెలు అవిసిపోయాయి. గుంపుగా వచ్చే తోడేళ్ళు చాలా ప్రమాదకరమని అతను విని వున్నాడు. సింహం, పెద్దపులివంటి క్రూరమృగాలకన్న గుంపుగా వుండే తోడేళ్ళు చాలా బలంగా పోరాడతాయని, ఎంత బలమయిన శత్రువునైనా చీల్చి చెండాడుతాయని విన్నాడు.

తను తప్పించుకునే దారి కనిపించటంలేదు. అవి మరింతగా ముందుకు దూసుకొస్తూన్నాయి.

జయరాం కొద్దిక్షణాలవరకు ఏం చెయ్యాలో తోచక నిశ్చేష్టుడై నిల్చుండిపోయాడు.

## 15

“వాళ్ళు పక్కకి తిరుగుతున్నారు. జాగ్రత్త! టార్చి ఫ్లాష్ వాళ్ళకు కనపడనివ్వకండి!” హెచ్చరించాడు కేవ్ కమాండర్ని.

ఆటవిక నాయకులిద్దరూ అడవిలో అణువణువునా గాలింపు చేస్తూన్నారు.

జయరాం అప్పటికే యెంతో దూరం పోయి వుండడని వాళ్ళ ధీమా! తమ సహచరులిద్దర్నీ దారుణంగా చంపేసి నందుకు కాదు వాళ్ళ కోపం. తమ సాములోరి నుంచి

తప్పించుకుపోయినందుకు ఆయన కోరిక నెరవేరకుండా చేసినందుకు క్రోధంతో వెతుకుతున్నారు. కనకదుర్గమ్మ బరిసెలతో తండ్రీ కొడుకు లిద్దర్నీ పొడిచెయ్యాలని మహోద్రేకంగా వున్నారు.

"మా అన్నయ్య మరోదారిన అడవినుంచి తప్పించుకునే ప్రయత్నం చేస్తున్నారేమో! వీళ్ళు కుడ్డిగా ఇద్దరు ఒకే దిశలో వెతకటానికి బయల్దేరారు. వీళ్ళకి భుజబలమే గాని బుద్ధిబలం నాస్తి. మనం రెండో డైరెక్షన్‌లో వెతుకుతూ పోదామా?" అన్నాడు కేశవ్.

కరుణాకర్ తల అడ్డంగా తిప్పి, "వీళ్ళిప్పుడు వెతుకుతున్నది మనం వచ్చిన దిశలోనే కదా! అంటే, బయటకు తప్పించుకునే దారి అదే కాబట్టి ఆ దిశలోనే వెతుకుతున్నారు. మన మనుకుంటున్నంత తెలివితక్కువ వాళ్ళేంకాదు వీళ్ళు" అన్నాడు.

కేశవ్ అవునన్నట్టుగా తలూపి, "అయితే వీళ్ళని వెంటనంటి తిరగడమే మంచిదేమో? అన్నయ్య పొరపాటున వీళ్ళకు దొరికిపోతే, మనం ఆదుకోవటానికవకాశముంటుంది" అన్నాడు.

"అందుకే నేను వీళ్ళని దృష్టిలో నుంచి దాటిపోనివ్వకుండా వెంటాడుతున్నది!"

"మరి యింకా ఆటవికులెవరైనా అన్నయ్యకోసం వెతుకుతున్నారేమో.... సిద్ధు కోయివాళ్ళనందర్నీ తన అధీనంలోనే వుంచుకున్నాడని, వాళ్ళకి అతని మాట వేదవాక్యమనీ పశుపతి చెప్పారుకదా! ఆటవికులందరు తల్చుకుంటే అన్నయ్యని పట్టుకోవటం ఏమంత కష్టం?!"

"ప్రస్తుతానికి యీ ఆటవికులిద్దరే కదా వెతుకుతున్నారు....!? నా ఊహే నిజమైతే కొండగుహలో

సెదుకు తప్ప వేరెవరూ లేరని చెప్పగలను, గుహ దగ్గర ఒక కోయవాడు చచ్చిపడున్నాడు కదా!....జయరాం వాడ్ని చంపి వుంటాడని నేననుకోవటంలేదు."

"ఎలా చెప్పగలరు? బాధించి కొడితే పిల్లికూడా యెదురుతిరుగుతుందని మీరు వినలేదా? ప్రాణానికి ప్రమాదమేర్పరయితే అన్నయ్యకూడా ఎదురుతిరిగి వాళ్ళతో కొట్లాటకు దిగివుండొచ్చు."

"అలా జరగటానికవకాశముంది. ఈపాటికి వీళ్ళకు దొరక్కుండా జయరాం తప్పించుకుపోయి వుంటే చాలా అదృష్టవంతులం. మనం తెల్లారేవరకు యెక్కడో గడిపేసి మెల్లగా అడవినుంచి బయటపడొచ్చు."

"తప్పించుకు పోవాలనే కోరుకుందాం. అరె పక్కకి తొలగు. ఏవో జంతువులు యిటే పరుగెడుతూ వస్తూ న్నాయి"....అని కరుణాకర్ అంటుండగానే తోడేళ్ళ గుంపు వాళ్ళ ముందునుంచి వేగంగా పరుగెడుతూ వెళ్ళి పోయాయి. వాటి దృష్టిలో పడకుండా వాళ్ళిద్దరు బాగా గుబురుగా వున్న పొదల వెనక దాక్కున్నారు.

"ఇవి తోడేళ్ళు. మనుషుల్ని చీల్చుకు తినేస్తాయి. అడవిలో నివసించే తోడేళ్ళు జంతువుల్ని వేటాడటంలో నేర్పరులు. ఒక్కోసారి సమీప పల్లెలమీద దాడిచేసి మేకల్ని, గొర్రెల్ని ఎత్తుకుపోతుంటాయికూడా!" అన్నాడు కరుణాకర్.

"అటు చూడు, కాగడాలు సరాసరి మనవైపే వస్తున్నాయి. వాళ్ళిద్దరు యిటే వస్తున్నారు. మన మీదనుంచే వెళ్తారు. బాటకి చాలా సమీపంలో వున్నాం మనం!" అన్నాడు కేశవ్.

అటవికులు పరుగులాంటి నడకతో వస్తున్నారు.

బరిసెల్ని పొదల్లో గుచ్చి చూస్తున్నారు. వాళ్ళ ఉద్దేశం పొదల్లో జహురాం దాక్కొనివుంటే బరిసె పోట్లకి కేకలు పెడతాడు కదా, అని!

"మనం పొదల్లో దాక్కోవటం ప్రమాదం. వాళ్ళు పొదల్ని పొడుస్తున్నారు" అన్నాడు కేశవ్.

"మనకలవాటుపడ్డ విద్య నుపయోగించడమే! పద, ఈ చెట్టెక్కుదాం" అన్నాడు కరుణాకర్.

ఇద్దరు చెట్టెక్కి గుబురుగా వున్న కొమ్మలమధ్య దాక్కొంటున్న సమయానికి ఆటవికులిద్దరు చెట్టుకింద కొచ్చేశారు సరిగ్గా అంతక్రితం వాళ్ళిద్దరు దాక్కొన్న గుబురు పొదను నాలుగుసార్లు బరిసెతో పొడిచి, అక్కడెవరూ దాక్కొనిలేరని నిర్ధారణ చేసుకుని అక్కడ్నుంచి ముందుకి కదిలారు.

సరిగ్గా అప్పుడే చిన్న పొరపాటు జరిగిపోయింది. కేశవ్ కూచున్న కొమ్మమీదికి రెండు ఎర్ర తేళ్ళు పాక్కుంటూ వచ్చాయి. చీకట్లో వాటిని వెంటనే గుర్తించలేకపోయాడు కేశవ్. మణికట్టు దగ్గర చురుక్కున తేలుకొండి గుచ్చుకోగానే అప్రయత్నంగా 'అబ్బా!' అన్న బాధాకరమైన శబ్దం బయటికొచ్చింది.

అంతే! వెళ్ళిపోతున్న ఆటవిక నాయకులిద్దరు ఒక్కసారిగా చెట్టుకిందికొచ్చేశారు. కాగడా వెలుగు చెట్టు మీదికి బాగా కనిపించేలాగా యెత్తుగా పట్టుకుని చూశాడు పైకి.

గుబురు మధ్య ఎవరో వున్నట్టు గుర్తుపట్టేశారు. "ఆ, దొరికిండు పోడు, ఆడే దిగుతాడు" అన్నాడొక ఆటవికుడు.

కరుణాకర్, కేశవ్ నిర్ఘాంతపోయారు. తేలువిషం

రక్తంలో చేరి విపరీతమైన బాధగా వుంది కేశవ్ కి. దాని కన్న జరిగిన పొరపాటుకి తామిద్దరికే ప్రాణంమీదికొచ్చింది. ఆటవికులు తామిద్దర్నీ చంపి పారేయటం ఖాయం!

"దిగు దావా, పొడతమంటావా?" కిందినుంచి అరిచారు ఆటవికులు. వాళ్ళు పైనున్నది జయరాం అనే అనుకొంటున్నారు.

కరుణాకర్ మెల్లగా చెప్పాడు. "దిగిపోవటంకన్న గత్యంతరం లేదు. వాళ్ళు మనం జయరాం కాదని తెలిసి వదిలేస్తే సరే, లేకుంటే తప్పించుకునే మార్గం అప్పుడు ఆలోచిద్దాం"

ఇద్దరు చెట్టు దిగారు.

ఆటవిక నాయకులు వాళ్ళిద్దర్ని చూడగానే ఆశ్చర్యపోయారు. "ఎవరహె మీ పొరగాల్లిద్దరు యీడకెందుకొచ్చిన్రు?" అన్నాడొక ఆటవికుడు.

కరుణాకర్ ధైర్యం చేసి, "మేము ఉద్యోగస్థులం. ఫారెస్టు ఆఫీసుకి పనిమీద వచ్చి, అడవి చూదామని బయల్దేరి అడవిలో తిరుగుతూ వెనక్కి వెళ్ళటానికి దారి మరచిపోయాం. తెల్లారే వరకు యిక్కడ గడిపేసి అప్పుడు ఫారెస్టాఫీసుకి వెళ్ళిపోదామనుకుని చెట్టుమీద కూచున్నాం...." అంటూ యింకా యేదో చెప్తుండగానే —వాళ్ళిద్దరు ఒకరికొకరు సైగ చేసుకుని "అదంతా మా సాములోరు సూసుకొంట్రు, మా వెనకబడి రండహె!" అన్నాడొక ఆటవికుడు.

కరుణాకర్, కేశవ్—వాళ్ళని నమ్మించటం కష్టమని, వాళ్ళకి అనుమానం పెరిగితే, నిలువునా నరికేస్తారని మనసులోనే ఓ నిర్ణయానికొచ్చి వాళ్ళవంక చూసి, "సరే,

వస్తాం, పదండి! మేము మీ శత్రువులం కాదు, మిత్రులమే. మమ్మల్ని ఫారెస్టాఫీసుకి తీసుకెళ్తే మీకే నిజం తెలుస్తుంది!" అన్నాడు కరుణాకర్.

ముందొక ఆటవిక నాయకుడు నడుస్తూండగా, కరుణాకర్, కేశవ్‌లు మధ్య, చివర రెండో ఆటవికుడు నిడుడి గుహావైపుగా సాగిపోయారు.

కరుణాకర్, కేశవ్ పరిసరాలు జాగ్రత్తగా గమనిస్తున్నారు జయరాం జాడ తెలుస్తుందేమోనని!

## 16

తోడేళ్ళ గుంపు దగ్గిర పడ్తుండగానే జయరాం మనసులోనే ఓ నిర్ణయానికొచ్చేశాడు.

చెట్టు దేనిమీదైనా ఎక్కి ఆత్మరక్షణ చేసుకోవాలనుకున్నాడు మొదట. కాని, చెట్టెక్కటం తనకి చేతకాదు. ఈలోపల తోడేళ్ళు తనని పసిగట్టి కండ కండలుగా చీల్చేస్తాయి. అందుకే సమీపంలో వున్న గుబురు పొదరిళ్ళ మధ్య దాక్కున్నాడు. ఊపిరి బిగబట్టాడు.

తోడేళ్ళ గుంపు అతను దాక్కున్న పొద పక్కనుంచే వెళ్ళిపోయాయి. అవి తనని పసిగడితే విందారగిస్తాయని అతనికి తెలుసు. టెన్షన్‌తో గుండె దడదడ కొట్టుకుంటుండగా, కుమార్‌ని భుజంమీద కదలకుండా పట్టుకుని ఆలాగే కూచుని చూస్తున్నాడు.

తోడేళ్ళు వెళ్ళిపోగానే లేచి నిల్చోబోయాడు సరిగ్గా అప్పుడే అవి మళ్ళీ వెనక్కి పరుగెత్తుకొని రావటం కనిపించింది.

అవి తనని పసిగట్టాయా? మనిషి జాడని అవి తేలిగ్గా గుర్తుపడతాయంటారు. తన జాడ పసిగట్టి, దాడిచెయ్య

టానికి వస్తున్నాయా?

జయరాంకి గుండెలవిసిపోయాయి.

ఎటూ పారిపోవటాని కవకాశంలేదు. మళ్ళీ ఇందాకటి లాగానే ఒదిగి కూర్చొని, వాటి గమనాన్ని పరిశీలిస్తే సరి— అనుకుని పొదల చాటున ఊపిరి బిగబట్టి కూచున్నాడు.

తోడేళ్ళ గుంపు అతను కూచున్న పొదరింటి దగ్గరే ఆగింది సరిగ్గా.

జయరాంలో టెన్షన్ మరింత పెరిగిపోయింది. అయినా చలనం లేకుండా అలాగే కూచున్నాడు. మొండి ధైర్యం. తెగింపు చోటు చేసుకున్నాయతనిలో. దుష్టుడైన సిద్ధుడి చేతిలో నిక్కృష్టంగా చచ్చేకన్నా జంతువులకి ఆహారమైపోవటమే మేలనిపించింది.

అయితే, తోడేళ్ళు ఈసారి మరో దిశలో సాగిపోయాయి. పొదరింటికి కుడివైపు నుంచి యెగుడు దిగుడుగా వున్న గుట్టలవైపు పరుగెత్తుకుంటూపోయాయి.

తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు జయరాం. తను అడవిలోకి ప్రవేశించిన దారి గుర్తు చేసుకోవాలని యెంతగా ప్రయత్నించినా గుర్తు రావటంలేదు. ముందు ఈ సిద్ధుడికి దూరంగా పారిపోతే తెల్లారేలోపల యెలాగో అడవినుంచి బయటపడకపోడు.

జయరాం పొదరిల్లు పక్కనుంచి బయటకు రాబోయి చటుక్కున ఆగిపోయాడు.

సరిగ్గా అప్పుడే కాగడాల వెలుతురు మళ్ళీ తనవైపుగా సాగివస్తూ కనిపించింది. హతాశుడై పోయాడు జయరాం. ఎన్ని ఆటంకాలో! తనసలు ప్రాణాలతో తప్పించుకోగలడా?

అప్పుడు అకస్మాత్తుగా గుర్తొచ్చింది జయరాంకి. తను తనొక్కడి గురించీ ఆలోచిస్తూ, కరుణాకర్, కేశవ్‌ల విషయం పూర్తిగా మరచిపోయాడు.

వాళ్ళు తననే వెతుక్కుంటూ వచ్చివుంటారు. తను కనిపించక, ఇంకా అడవిలో వెతుకుతూ వుంటారు. వాళ్ళనెలాగైనా కల్సుకుని తన ఉనికి తెలియజేస్తే ముగ్గురు కలిసి యెలాగో ఇక్కడ్నుంచి తప్పించుకు పారిపోవచ్చు!

ఇంతకీ వాళ్ళేమయినట్టు?! ఏదైనా చిక్కుల్లో పడలేదు కదా! ఈ రాత్రి సమయంలో అలవాటులేని ఈ అడవి మధ్యలో తనకోసం వచ్చి ఏం అవస్థలు పడుతున్నారో!

అప్రయత్నంగా టైం చూసుకోబోయి, అంతలోనే చేతికి వాచీలేదని గుర్తొచ్చి ఆ ప్రయత్నం విరమించుకుని కాగడాల వెలుతురువైపే చూస్తున్నాడు.

నిలువెత్తు పెరిగిన ఆ పిచ్చిమొక్కలు, పొదలు తనని బయటకు కనిపించకుండా పూర్తిగా కప్పేస్తున్నాయి. అది కొంతవరకు నయమే!

కాగడాలు బాగా దగ్గరయ్యాయి. ఇద్దరు ఆటవిక నాయకుల్ని గుర్తుపట్టాడు జయరాం. వాళ్ళిద్దరి మధ్య నడుస్తున్న కేశవ్‌ని, కరుణాకర్‌ని చూసి త్రుళ్ళిపడ్డాడు.

ఏమిటి, వీళ్ళకి చిక్కిపోయారా తన వాళ్ళు? తను తప్పించుకుని గంటకూడా పూర్తికాలేదు, ఇంతలోనే తనవాళ్ళు వాళ్ళకి బందీలయిపోయారు. ఎంత పని జరిగిపోయింది?

జయరాం గుండెని ఎవరో యినప పిడికలితో నొక్కివేసినట్టు బాధతో విలవిలలాడాడు. వాళ్ళనెలా తప్పిం

చాలి? తను తప్పించుకుపోయిన ఉక్రోషంతో ఆ స్వామి వీళ్ళమీద పగతీర్చుకోడుకదా! అసలు వీళ్లెవరో ఆతనికెలా తెలుస్తుంది? వీళ్ళను హింసించి నిజం చెప్పిస్తాడా? ఏమో అంత ఘనుడే!

టెన్షన్‌తో, ఆపుకోలేని ఉద్విగ్నతతో స్నేహితుడ్ని చూస్తూ కర్తవ్యవిముఖుడిలా అలాగే కొద్దిసేపటి వరకు నిల్చుండిపోయాడు జయరాం.

# 17

"వీళ్ళెవరు?" హుంకరించాడు నిత్యానందస్వామి.

ఆటవిక నాయకులు చెప్పారు.

"వీళ్ళ సంగతి తర్వాత చూసుకోవచ్చును. వాడేడీ? దొరకలేదా?" ఆత్రుత, అసహనం నిండిన గొంతుతో అడిగాడు స్వామి.

"దొరకలేదయ్యోను. ఈలోపట యిాల్లు ఆ పడితే తోల్కొచ్చినం..అదు మన్నం వొదిలి పోయేడయ్యోరూ! నా గూడెపోళ్ళని నిద్దర్లేపి అడి వెతికిస్తాను" అన్నాడో నాయకుడు. రెండో నాయకుడు కూడా అలాగే చెప్పాడు.

"అయితే, ఆ పనేదో వెంటనే చెయ్యండి. వాడు అడవిదాటి బయటకు పోకూడదు. వాడు తప్పించుకు పారిపోయాడంటే మన సంగతంతా లోకానికి చాటేస్తాడు. ఆ తర్వాత మనం తలపెట్టిన మహాయజ్ఞం మూలపడిపోతుంది. మనకు దక్కాలసిన నిధి చేజేతులా వదిలేసుకోవలిసి వస్తుంది" స్వామి ఆవేశంలో తమ రహస్యాన్ని వెల్లడించేస్తూన్న సంగతిని విస్మరించాడు.

కరుణాకర్, కేశవ్ లకి నిత్యానందస్వామి యేం కోరి ఈ నరబలులు—అందునా పదేళ్ళలోపు మగపిల్లలు—

నిర్వహిస్తున్నాడో అర్థమయిపోయింది.

ఆటవిక నాయకుడ్ని కొద్దిగ పరుగులాంటి నడకతో బయటకి వెళ్ళిపోయారు.

నిత్యానందస్వామి కరుణాకర్, కేశవ్‌లను సమీపించి, "మీరెవర్రా? ఈ అడవిలో ఈ సమయంలో ఏం చేస్తున్నారు? నిజం చెప్పకపోతే మీ యిద్దర్నీ యిక్కడే సమాధిచేసేస్తాను" అంటూ హుంకరించాడు.

కరుణాకర్ ఆటవికులకి చెప్పినట్టే స్వామికీ చెప్పాడు.

స్వామి వికటంగా నవ్వి, "మీ కాకమ్మ కథలు నమ్మటానికి నేను అమాయకులైన కోయవాడ్ని కాదు. వాళ్ళు కూడా మీరు చెప్పేది నమ్మలేదు కాబట్టే నా దగ్గరకు మిమ్మల్ని తీసుకొచ్చారు. నిజం చెబుతారా సరే, లేకుంటే ఈ వేటకత్తితో ఒకేసారి మీ ఇద్దరి తలలు నరికి పారేస్తాను" అన్నాడు.

కరుణాకర్, కేశవ్ మాట్లాడలేదు. తామేం చెప్పినా అతను వినడని వాళ్ళకు తెలుసు. అతనొక్కడే వున్నాడు గుహలో. తామిద్దరున్నారు. అదృష్టవశాత్తు తమని ఆటవికులు బంధించకుండా మామూలుగానే వదిలేశారు. తప్పించుకు పారిపోవటం పెద్ద కష్టంకాదు.

ఎదురుగా నిత్యానందస్వామి చేత వేటకత్తి ధరించి క్రూరంగా వాళ్ళిద్దరివైపు నిప్పులు కురిపిస్తూ చూస్తున్నాడు. నిజంగానే నరికేసేలా వున్నాడు. జయరాం తప్పించుకు పారిపోయాడన్న కోపంతో తమమీద ప్రతీకారం తీర్చుకోబోతున్నట్టున్నాడు.

ఒక్కొక్క అడుగు ముందుకువేస్తూ వాళ్ళని సమీపిస్తున్నాడు స్వామి.

సరిగ్గా అదే సమయంలో మెరుపు వేగంతో నేల మీదికి వంగాడు కేశవ్. ఏం చెయ్యబోతున్నాడో స్వామి గ్రహించేలోపల యెగిరి అతని గుండెలమీద తన్నాడు.

స్వామి చేతిలోని కత్తి ఎగిరి అల్లంతదూరంలో పడిపోయింది. చాపచుట్టలా నేలమీద పడిపోయాడు స్వామి.

ఈలోపల కరుణాకర్ గుహలో వెలుగుతున్న కాగడాలని ధ్వంసం చేసేశాడు. కిందపడ్డ వేట కత్తిని కేశవ్ చేజిక్కించుకున్నాడు. లేవబోతున్న స్వామి కాళ్ళమీద అడ్డంగా కత్తితో నరికాడు.

స్వామి కాళ్ళు తెగిపోయి, పెద్దగా పెడబొబ్బ పెట్టాడు. నిశ్శబ్ద వాతావరణంలో ఆ కేక గుహలోను, అడవిలోను ప్రతిధ్వనించింది.

స్వామి గిలగిల కొట్టుకుంటూనే చేతిని చాచి, గోడకి చేర్చి వున్న బరిసెనందుకోబోయాడు.

ఈసారి స్వామి కుడిచేతిని నరికేశాడు కేశవ్. స్వామి మరోసారి ఆర్తనాదం చేశాడు.

కేశవ్ మరోసారి కత్తినెత్తాడు. కాని అంతలోనే పెద్దగా అరచుకుంటూ దాదాపు ఏభై అరవైమంది ఆటవికులు గుహలోపలకు చొచ్చుకొని వచ్చేశారు. వారి వెంట యిందాకటి ఆటవిక నాయకులిద్దరు వున్నారు.

వాళ్ళందర్నీ ఒక్కసారిగా చూడగానే కేశవ్, కరుణాకర్ లు నిర్ఘాంతపోయి, చేష్టలుడిగి అలాగే నిల్చుండిపోయారు.

## 18

జయరాం ఇంకా ఆలోచనల్నుంచి తేరుకోకముందే ఆటవిక నాయకులిద్దరు అడవిలోనికి పరుగుతీయటం కని

పించింది. వెళ్ళినంత వేగం గాను వాళ్ళు సిద్ధుడి దగ్గర్నుంచి మళ్ళీ బయటకు పరుగెత్తుకొచ్చారు.

అంటే కేశవ్, కరుణాకర్ గుహాలోపలే వుండి పోయారు. వాళ్ళని స్వామి ప్రాణాలతో వదుల్తాడా? ఆటవికులు మళ్ళీ యెందుకు పరుగెత్తారు? తనని వెతుక్కుంటూ వెళ్తున్నారా?

దృఢనిశ్చయంతో గుహ వైపు అడుగులు వేశాడు జయరాం. అయితే అంతలోనే, వెనుక నుంచి యెవరో పరుగెత్తుకొస్తున్న సవ్వడి వినిపించింది.

చటుక్కున ఓ పెద్ద చెట్టు మొదలు వెనక దాక్కున్నాడు జయరాం.

ఒక్కసారిగా ఏభై అరవై మంది ఆటవికులు కొండ గుహ వైపు పరుగెత్తుకొస్తున్నారు. వారిలో ఆటవిక నాయకులిద్దరు వున్నారు.

ఆశ్చర్యంతో, టెన్షన్‌తో అటే చూస్తున్నాడు జయరాం—

అప్పటికే నిత్యానందస్వామి చివరి దశలో వున్నాడు. విపరీతంగా రక్తస్రావం జరగటంతో సొమ్మసిల్లి పోయాడు. 'దాహం' అంటూ సైగ చేశాడు.

ఆటవిక నాయకులతో బాటు, ఆటవికులందరు మహోగ్రంగా చూస్తున్నారు కరుణాకర్, కేశవ్ లవంక.

ఓ ఆటవిక నాయకుడు మంచినీళ్ళు పోశాడు స్వామి గొంతుకలో. అయితే గుటకపడలేదు. స్వామి కళ్ళు అలా తెరచుకునే వున్నాయి.

అతని ప్రాణాలు అనంత వాయువుల్లో కలిసి పోయాయి.

ఆటవికులు పెద్దగా గగ్గోలు చేస్తూ అరిచారు. "మా

అయ్యోర్ని చంపినందుగ్గాను మీ యిద్దర్నీ కొండదేవరకి బలేసేత్తాం ఒహో, గూడెపోల్లూ, ఈల్లిద్దర్నీ తోల్కొని రండి!" అంటూ ఆటవిక నాయకులు కరుణాకర్, కేశవ్‌లను బంధించమని తమవాళ్ళ నాజ్ఞా పించారు.

ఆ మరుక్షణమే వాళ్ళిద్దరి రెక్కలు విరిచికట్టి కొండ గుహనుంచి బయటకు లాక్కొచ్చారు కోయి వాళ్ళు.

పెద్దగా కేకలువేస్తూ, వాళ్ళిద్దర్నీ శాపనార్థాలు పెడుతూ కొండదేవర వున్న స్థలానికి లాక్కుపోతున్నారు కోయగూడెం వాళ్ళు.

ఇదంతా పరిశీలించి గమనిస్తూన్న జయరాం గుండె లవిసిపోయాయి.

ఎంత పని జరిగిపోయింది! ఇప్పుడు వాళ్ళనుంచి తన వాళ్ళిద్దర్నీ విడిపించటం జరిగే పనికాదు. ఇదివరకు సిద్ధు తనకు చూపించిన కొండ దేవత విగ్రహానికి వీళ్ళిద్దర్నీ బలిస్తారు కాబోలు! అందుకే ఆ వైపుగా తీసుకుపోతున్నారు.

తను ఎలాగైనా వాళ్ళిద్దర్నీ రక్షించుకోవాలి! అవును. వాళ్ళని బలి పెట్టకూడదు.

బలి తంతు దాదాపు గంట గంటన్నర సాగుతుంది. ముందు వీళ్ళని కొలనులో స్నానాలు చేయిస్తారు. తర్వాత నారచీరలతో అలంకరిస్తారు. అప్పుడుగాని బలితంతుకు పూనుకోరు. ఈలోపల తను చెయ్యవలసిన పని చాలా వుంది.

జయరాంలో కొత్త ఉత్సాహం వచ్చింది.

ఆటవికులు బాగా దూరమయిపోయాక, ఒక్కసారిగా

బయటికొచ్చి పరుగందుకున్నాడు.

భుజమ్మీద కుమార్ ఎగిరెగిరి పడుతున్నాడు. కాళ్ళకి రాళ్ళు రప్పలు, ముళ్ళకంపలు గుచ్చుకుని చర్మం లేచిపోయి రక్తం వరదలై కారుతున్నా ఆయాసంతో ఒగర్చుతున్నా యేమీ లెక్క చేయకుండా యేటవాలు గుట్టను చేరుకున్నాడు.

గుట్ట ఎక్కి దిగితే ఫారెస్టు క్వార్టర్సున్నాయి. వాళ్ళ సహాయం తీసుకోవాలి. జరగబోతున్న బలుల్ని ఆపివెయ్యాలి తనకోసం ప్రాణాల్ని లెక్క చెయ్యకుండా అడవిలో ప్రవేశించి ప్రాణాపాయ స్థితిలో వున్న తన వాళ్ళని రక్షించుకోవాలి!

జయరాంలో ఒకే దృఢనిశ్చయం! అప్పటికే బాగా అలసిపోయాడు. ఒళ్ళంతా చెమట్లతో స్నానం చేసినట్టుగా తడిసిపోయింది. దాహంతో నాలుక పిడచ కట్టుకుపోతోంది. అలాగే గుట్ట యెక్కుతున్నాడు జయరాం.

అప్పుడు తెల్లవారుఝాము నాలుగు గంటలయింది.

## 19

“ఏమిటి మీరంటున్నది? ఈ అడవిలో నరబలులా? ఉత్తది. మేం నమ్మం” అన్నాడు ఫారెస్టాఫీసరు.

“నన్ను నమ్మండి సార్! ఇదుగో నా కొడుకుని బలివ్వబోతే నేను రక్షించుకుని తెచ్చుకుంటున్నాను. నన్ను, బాబుని రక్షించటానికి వచ్చిన నా వాళ్ళిద్దర్ని పట్టుకుని బలిచ్చేస్తున్నారు. కావాలంటే మీ వెంట నేను వస్తాను. చూపిస్తాను. దయచేసి ఈ బలుల్ని ఆపండి!” వేడుకున్నాడు జయరాం.

ఫారెస్టాఫీసరుకి తెలుసు. పదేళ్ళలోపు పిల్లలు ఎందుకు అంతర్ధానమవుతున్నారో.... సిద్ధు ఎక్కడుంటాడో, వాడు చేస్తున్న తంతు యేమిటో అన్నీ తెలుసు.

కాని కోయగూడెంవాళ్ళు మూర్ఖులు! వాళ్ళ స్వవిషయాల్లోకి తల దూర్చితే ఎంతటి వాళ్ళనయినా అంతం చేస్తారు. అది గతంలో తను ఎరిగిన సత్యం! అందుకే ఈ విషయంలో తలదూర్చగూడదని నిర్ణయించుకుని జయరాం మాటలకి అలా జవాబిచ్చాడు.

తాణేదారు, ఫారెస్టరు ముందుకొచ్చి, "సార్, పోనీ వెళ్ళిచూద్దాం. ఇన్నాళ్ళు రెడ్ హేండెడ్ గా వాళ్ళని పట్టుకోవటం వీలుకాలేదు. ఇప్పుడు వాళ్ళు బలివ్వగా చూస్తూ పట్టుకుంటే, ఇంతటితో వీళ్ళ రాక్షస కృత్యాలని అరికట్టిన వాళ్ళమవుతాం. లేకుంటే ఇలాంటి అవకాశం మళ్ళీ ఎన్నడూ రాదు" అన్నాడు ఫారెస్టాఫీసర్ తో రహస్యంగా.

అసలు సంగతేమిటంటే వాళ్ళిద్దరికి ఒక్కొక్క కొడుకు వున్నారు. వయసు ఒకడికి తొమ్మిదేళ్ళు మరొకడికి ఎనిమిదేళ్ళు. సిద్ధుడి కళ్ళు తమ పిల్లలమీద పడక ముందే వాడి ఆట కట్టించటానికి మంచి అవకాశం కోరి కింద. సిద్ధుడు అప్పటికే చచ్చిపోయాడని జయరాంకి తెలియకపోవటంవల్ల, ఆ విషయం చెప్పలేదు.

మరో పదినిమిషాల్లో ఫారెస్టాఫీసరు, తాణేదారు, గార్డు, అటెండర్స్, మరో పదిమంది సిబ్బంది పూర్తి సాయుధులై కొండగుహలవైపు బయల్దేరారు.

జయరాం, కుమార్ ని ఫారెస్టాఫీసరు యింట్లో ఆడవాళ్ళ కప్పగించి వాళ్ళతో బయల్దేరాడు.

# 20

వాళ్ళు వెళ్ళేసరికి బలితంతు ప్రారంభమయ్యింది.

అప్పటికే కేశవ్‌ని, కరుణాకర్‌ని స్నానమాడించి నారదుస్తులు ధరింపచేశారు. వాళ్ళిద్దరి ముఖాలకి సింధూరపు బొట్లు పెట్టారు. మెళ్ళో కాయలు, పూలతో చేసిన దండల్ని వేశారు.

బలివ్వటానికి యిక కొద్ది నిమిషాలు మాత్రమే కాల వ్యవధి వున్నది.

ఫారెస్టాఫీసరు చప్పుడు చెయ్యకుండా తన వాళ్ళని ఆ కొండదేవత విగ్రహం చుట్టూ ఎవరికీ కనిపించకుండా వలయాకారంగా అమర్చాడు. ఒక వేళ ఆటవికులు ఎదురు తిరిగినా అక్కడికక్కడే కాల్చివేయటానికి రంగం సిద్ధం చేశాడు.

ఆటవికులు బాగా సురాపానం చేసి వున్నారేమో మహానందంగా నాట్యం చేస్తున్నారు — తప్పెటలు ప్రళయ జంఝామారుతాన్ని సృష్టిస్తూ కర్ణకఠోరంగా మోగుతున్నాయి.

కరుణాకర్, కేశవ్‌లలో ప్రేతకళ వచ్చేసింది. ఇక తమకు అంతిమ ఘడియలు సమీపించాయని నిర్ధారణ చేసుకున్నారు.

తప్పెటల వేగం హెచ్చింది.

ఆటవిక నాయకులిద్దరి చేతుల్లోను పదునైన వేట కత్తులు కాగడాల వెలుగులో మెరుస్తున్నాయి.

అప్పుడు ఉదయం అయిదు గంటలు కావస్తోంది.

తెల్లవారబోతోంది.

వేటకత్తులు గాల్లోకి లేచాయి కరుణాకర్, కేశవ్‌ల

వస్తుకలు నరకటానికి.

సరిగ్గా అదే సమయంలో గాల్లో తుపాకులు పేల్చిన శబ్దం వినిపించింది.

ఒక్కసారిగా కోలాహలం ఆగిపోయింది.

ఆటవికులు దిగ్భ్రమచెంది చూస్తున్నారు.

ఫారెస్టాఫీసర్‌తో పాటు, పదిహేనుమంది తమని తుపాకులతో చుట్టుముట్టినట్టు వాళ్ళు గ్రహించారు.

ఫారెస్టాఫీసరు గట్టిగా అరచి ఇలా చెప్పాడు! "ఈ బలికార్యక్రమం మా కళ్ళారా చూశాం. ఇందుకు కారకులైనవారిని మేము అంత తేలిగ్గా వదిలిపెట్టం. మాకు లా అండ్ ఆర్డరు పవర్సు—అంటే, మీకు తెలియదు—మిమ్మల్ని బంధించటానికి సర్వహక్కులు వున్నాయి. పంతానికి పోయి, తిరగబడాలని ప్రయత్నం చేస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చిపారేస్తాం."

ఆటవికులు నిషా దిగిపోయి, తలలు వాల్చేశారు. ఒకరొకరుగా అందరూ ఓ పక్కగా వచ్చి నిల్చున్నారు.

ఆటవిక నాయకులు ముందుకొచ్చి, చేతులు చాపి, "మా వోళ్ళ నేం సెయ్యొద్దు. ఈ బలులు సేత్తున్నది మాం. మా పసుసుల్నేటి సెయ్యొద్దు. మాం వోత్తాం. కొల్కపొండి" అన్నారు.

ఫారెస్టాఫీసరు అదే అధికార స్వరంతో, "ముందు మీరందరు మాకు లొంగిపొండి. తర్వాత మిమ్మల్ని వదిలేస్తాం. ఇందులో నిజమైన నేరస్థుల్నే మేం శిక్షిస్తాం. తక్కిన సంగతులు పరిష్కరించటానికి కోర్టుంది!" అన్నాడు.

నాయకులు అంగీకారసూచకంగా తలూపారు. వాళ్ళు లొంగిపోయారనే అందరు అనుకొంటున్న క్షణంలో

ఒక్కసారిగా వాళ్ళందరు తిరగబడ్డారు. బరిసెలతో వాళ్ళమీద దాడిచేశారు.

ఫారెస్టాఫీసరు నిర్ఘాంతపోయాడు. వాళ్ళు ఇంతగా తెగిస్తారని అతనుగాని, అతని సహచరులుగాని అనుకోలేదు.

"ఫైర్!" అంటూ అరిచాడు ఫారెస్టాఫీసరు.

పది పదిహేనుమంది ఆటవికులు నేలకూలారు. అటవీ సిబ్బంది నాలుగురైదుగురు గాయపడ్డారు బరిసెల పోట్లకు.

అయితే మరో పదినిముషాల్లో మరో పది హేనుమంది ఆటవికులు నేలకూలిపోగానే, ఆటవిక నాయకులు లొంగిపోయారు.

బరిసెల్ని నేలమీద పారేసి మోకాళ్ళమీద వంగి తమ లొంగుబాటును సూచించారు.

ఫారెస్టాఫీసరు విజయగర్వంతో నవ్వాడు. తమ వెంట తెచ్చిన పెద్ద మోకుతో ఆటవికులందర్నీ బంధించమని ఆదేశించాడు.

తెల్ల తెల్లవారుతుండగా అందరు ఫారెస్టాఫీసుకు చేరుకున్నారు.

—: అయిపోయింది:—

# పైచేయి?

## వసుంధర

తాజ్ మహాల్ హోటల్లో అరవై నాలుగో నంబరు గది.

గదిలో అసహనంగా అటూ యిటూ పచార్లు చేస్తున్నాడు సూర్యారావు.

అప్పుడు కాలింగ్ బెల్ మ్రోగింది.

సూర్యారావు పరుగున వెళ్ళి తలుపుతీసి బయట కనబడిన వ్యక్తిని చూసి నిరుత్సాహపడ్డాడు.

అతడు సన్నగా పొడుగ్గా వున్నాడు. నున్నగా దువ్విన మీసాలు. ఫుల్ సూట్లో వున్నాడు. చూడగానే మంచి సంస్థలో ఆఫీసరుద్యోగం చేస్తున్నాడనిపిస్తుంది. అతడి భుజానికో ఎయిర్ బ్యాగు వ్రేలాడుతోంది.

"మీరు సూర్యారావుగారే కదూ?" అన్నాడతడు.

"అవును—" అన్నాడు సూర్యారావు.

"ఆలస్యమైనందుకు మన్నించాలి. అనుకోకుండా చిన్న పని తగిలింది—" అన్నాడతడు.

"ఎవరు మీరు?" అన్నాడు సూర్యారావు.

"నా పేరు రమణ—" అన్నాడతడు.

సూర్యారావు ఒకడుగు వెనక్కి వేసి—"లోపలికి రండి—" అన్నాడు. అతడు తలుపులు వేసి లోపలికి ప్రవేశించాడు.

"నన్నిక్కడ కలుసుకోమని మీకెవరు చెప్పారు?"

"గుప్తా!"

సూర్యారావు అనుమానంగా—"గుప్తా మీ గురించి చాలా చెప్పాడు. కాని మిమ్మల్ని చూస్తూంటే ఆ రమణ మీరేననిపించడంలేదు—" అన్నాడు.

"అదా మీ సమస్య?...." అని — "ఒక్కసారి బాత్రూంకు వెళ్ళొస్తాను—" అన్నాడు రమణ.

"ఊఁ" అన్నాడు సూర్యారావు.

రమణ ఎయిర్ బ్యాగుతో బాత్రూంకు వెళ్ళొచ్చాడు. అందుకు అయిదు నిమిషాలు పట్టింది.

తిరిగివచ్చిన మనిషిని చూసి ఆశ్చర్యపోయాడు సూర్యారావు.

గళ్ళ లుంగీ, అడ్డచారల బనియన్, చెదురుమదురుగా వున్న మీసాలు, గుబురు జుత్తు, పొంగిన కండలు—ఆ మనిషి పచ్చి నెత్తురు తాగే కిరాతకుడిలా వున్నాడు. అతణ్ణలా చూడగానే సూర్యారావుకు భయంకూడా వేసింది.

"ఇప్పుడు నా రూపం తృప్తినిస్తోందా?" అన్నాడతడు నవ్వుతూ.

సూర్యారావు గొంతు సవరించుకుని గుటకపట్టి-"అయిదు నిమిషాల్లో యెంత మార్పు?" అన్నాడు.

"ఇదే నా అసలు రూపం. పెద్దవాళ్ళ సాహాసంతో మాట, నడక కాస్త మారిందంతే!" అని—"ఇందాకటి

నా రూపానికీ ఇప్పటి నా రూపానికీ పోలికుండదు. అందుకే నా నేరాలు పట్టుడవు. ఇక మీ విషయం చెప్పండి—" అన్నాడు రమణ.

"గుప్తా అన్నీ చెప్పలేదా?"

"నేను మీ భార్యను హత్య చేయాలి. అంతవరకూ ఆయన చెప్పాడు. అందుకు మీరు చేసే యేర్పాట్లు నాకు తెలియాలి కదా!" అన్నాడు రమణ.

"రేపు సాయంత్రం థియేటర్ మురళిలో ఆమె 'ప్రేమించు—పెళ్ళాడు'—సినిమా చూస్తుంది. అక్కడి కామె కార్లో వస్తుంది. కారు నంబరు APW 9872. ఆమె థియేటర్ కు తన స్నేహితురాలితో రావచ్చు. అయినా ఆమెను గుర్తుపట్టడం కష్టంకాదు. ఆమె లేత నీలంరంగు చీర ధరిస్తుంది. చీర బోర్డర్లో నెమలి బొమ్మలుంటాయి. మనిషి ఎత్తు సుమారు అయిదడుగుల మూడంగుళాలుంటుంది—" అన్నాడు సూర్యారావు.

"ఫోటో లేదా?"

"ఏం—ఈ వివరాలు చాలవా?"

"చాలు—" అన్నాడు రమణ.

"ఇంటర్వెల్ తర్వాత సీట్లో ఉండగానే ఆమెను హత్య చేయాలి—" అన్నాడు సూర్యారావు.

"ఓకే—" అన్నాడు రమణ.

"ఓకే అన్నంత సులభం కాదు—" అన్నాడు సూర్యారావు.

"అంతకంటే సులభం?"

"ఎలా?"

"ముందుగా ఒక సూది గుచ్చితే స్పృహ తప్పుతుంది. రెండో సూది గుచ్చితే విష మెక్కుతుంది. మనిషి అరవను

కూడా అరవదు. సినిమా అయ్యేవరకూ ఆమె చచ్చినట్లె వ్వరికీ తెలియదు—...." అన్నాడు రమణ.

"వెరీగుడ్!" అన్నాడు సూర్యారావు.

"నాకు అడ్వాన్సు కావాలి...."

"పని పూర్తయ్యాక మొత్తం యిస్తాను...."

"అడ్వాన్సు లేనిదే యే పనీ చేయను నేను...."

"గుప్తా నాకీ విషయం చెప్పలేదు—...."

"సరేలెండి—గుప్తా గారితో నే ఈ విషయం మాట్లాడతాను...." అంటూ రమణ లేచాడు.

"రేపు — థియేటర్ మురళిలో మొదటి ఆట.... గుర్తుంది కదూ?" అన్నాడు సూర్యారావు.

"ఒకసారి నాకు చెప్పాక—ఆ తర్వాత మీరు మనసు మార్చుకున్నా కూడా మీ భార్యను రక్షించుకోలేరు—" అన్నాడు రమణ.

"వెరీగుడ్!" అన్నాడు సూర్యారావు.

## 2

"అయాం సారీ సూర్యా!" అన్నాడు సూర్యారావు.

"ఏం?" అంది సూర్యముఖి.

"అనుకున్న ప్రకారం థియేటర్ మురళిలో ఫస్టు షోకి రెండు టికెట్సు రిజర్వు చేయించాను. కానీ నాకు రావడం కుదరదు...."

"ఎందుకని?"

"అర్జంటు ప్రయాణం తగిలింది—"

"ఎక్కడికి?"

"అది నీకు రేపు చెబుతాను—" అన్నాడు సూర్యారావు.

"సరే—మీ యిష్టం. సినిమా టికెట్స్ కాన్సిల్

చేసెయ్యండి...."

"అలా వద్దు. నువ్వు సినిమా చూడాలనుకున్నావు కదా-...."

"మీరు లేకుండా ఎలా చూడను?"

"నీ స్నేహితురాలెవరినైనా తీసుకుని వెళ్ళు...."

సూర్యముఖి కాసేపాలోచించి — "కలిసి సినిమా చూద్దామని రేవతి చంపేస్తోంది. ఇప్పుడే ఫోన్ చేస్తాను" అంది

"సరే—" అన్నాడు సూర్యారావు.

సూర్యముఖి ఫోన్ చేసి—"ఇంకో గంటలో రేవతి బయల్దేరి వస్తానంది. నాకు చాలా థాంక్స్ కూడా చెప్పింది. ఎప్పటిలాగే ఆమె శ్రీవారు టూర్లో వున్నారుట—" అంది ఉత్సాహంగా.

"సరే—అయితే నువ్వు మన నల్లకారు తీసుకుని వెళ్ళు...." అన్నాడు సూర్యారావు.

"మన కారెందుకండీ? రేవతి కార్లో వెడతాం...." అంది సూర్యముఖి.

సూర్యారావు చిరాగ్గా ముఖంపెట్టి—"రేవతిని నువ్వు సినిమాకు తీసుకుని వెడుతున్నావా — ఆమె నిన్ను తీసుకుని వెడుతోందా?" అన్నాడు.

"ఏం?"

"సినిమాకు వాళ్ళ కారు వద్దు. మన కారే వాడాలి. అప్పుడే గౌరవంగా ఉంటుంది" అన్నాడు సూర్యారావు.

"కానీ—రేవతి మనింటికి కార్లో వస్తుంది కదా!"

"వద్దు. నువ్వే మన కార్లో వెళ్ళి రేవతిని పికప్ చేయి...."

"నాటే బ్యాడైడియా...." అంది సూర్యముఖి.

"మరి ఫోన్ చేసి ఆమెకు చెప్పు..." అన్నాడు సూర్యారావు.

సూర్యముఖి అలాగే ఫోన్ చేసింది.

"ఏమంది రేవతి?" అన్నాడు సూర్యారావు.

"ఇట్స్ సో నైసాఫ్ యూ అంది—" అంది సూర్యముఖి.

"చూశావా—నీ మర్యాద కామె సంతోషించింది" అన్నాడు సూర్యారావు. అతడి ముఖం మాత్రం గంభీరంగా వుంది.

"ఎలాగైనా మీ తెలివి అమోఘం!" అని మెచ్చుకుంది సూర్యముఖి.

"నా తెలివితేటలు నీ ముందు పనిచేయవుగా?"

"ఊరికే అలాగంటారు. మీ తెలివికి నేనెప్పుడూ దాసోహమంటారు. అందుకెన్నో తిరుగులేని ఋజువులూ ఉన్నాయి—...."

సూర్యారావు గంభీరంగా—"ఇప్పుడింకో ఋజువు కావాలి. నిన్నిప్పుడు లేత నీలం రంగు నెమళ్ళ బోర్డరు చీర కట్టుకొని రమ్మంటాను. నా మాట వింటావా?" అన్నాడు.

"ఆ చీరెందుకు?" అంది సూర్యముఖి.

"నాకు నిన్నిప్పుడా చీరలో చూడాలనిపించింది."

"అది నాలుగు రోజుల క్రితమే మాసిపోయింది. లాండ్రీకింకా పంపలేదు—" అంది సూర్యముఖి.

"బీరువాలో చూడు. ఉంటేనే కట్టుకో—"

సూర్యముఖి లోపలకు వెళ్ళి క్షణాలమీద తిరిగివచ్చి "ఆ చీర ఎవరుతికించారు?" అంది.

"నేను—...." అన్నాడు సూర్యారావు "మొన్న అర్జంటు వాష్‌కి పంపించాను...."

"ఎందుకు?"

"నిన్నా చీరలో చూస్తుంటే మన పెళ్ళిరోజు గుర్తొస్తుంది. ఆ చీర మాసి పడివుంటే చూడలేక పోయాను...."

"ఆ చీరకీ మన పెళ్ళికీ సంబంధ మేమిటి?"

"చెప్పలేను...."

"లేదు—ఏదో వుంది?"

సూర్యారావు తటపటాయిస్తున్నట్లు—"చెప్పనా?" అన్నాడు.

"ఊఁ" అంది సూర్యముఖి.

"కొన్ని చీరలు నీ వయసును బాగా తగ్గిస్తాయి. కొన్ని నీ వయసును పెంచుతాయి. నేను చెప్పిన చీర మాత్రం నిన్ను పెళ్ళికూతురుగా మార్చేస్తుంది. అది నా సైకాలజీ కావచ్చు— ..."

సూర్యముఖి అదోలా ముఖం పెట్టి-"మన పెళ్ళై రెండున్నర ఏళ్ళయింది. నేనిప్పుడు మీకు నచ్చడంలేదా?" అంది.

"అది నేను చెప్పకూడదు, నా ప్రవర్తనను బట్టి నీకేమనిపిస్తున్నదీ నువ్వే చెప్పాలి—...." అన్నాడు సూర్యారావు.

"ముందు నాతో సినిమాకు వస్తానన్నారు. టికెట్స్ కూడా కొన్నాక మనసు మార్చుకుని రేవతితో వెళ్ళమన్నారు...."

"ఇలాంటి వాటికి కారణాలుంటాయి...."

"నేను నచ్చకపోవడం ఆ కారణాల్లో ఒకటి...."

"నువ్వు నాకు నచ్చకపోవడమేమిటి? నేనే నీకు నచ్చడంలేదని అనుమానంగా ఉంటే!" అన్నాడు సూర్యారావు చటుక్కున.

"మీ కా అనుమానమెందుకొచ్చింది?" అంది సూర్య ముఖి. ఆమె భ్రుకుటి ముడతలు పడింది. కళ్ళలో కుతూహలం తొంగిచూసింది.

"నేను నిన్నో చీర కట్టుకోమని ప్రత్యేకంగా కోరాను. నువ్వింకా కట్టుకోలేదు —" అన్నాడు సూర్యారావు.

"అందుకే మీ తెలివికి దాసోహమన్నాను. ఇప్పుడే చీర మార్చుకుని వస్తానుండండి—...." అంటూ పక్క గదిలోకి వెళ్ళి చీర మార్చుకుని వచ్చిందామె.

సూర్యారావు ఆమె వంకే శ్రద్ధపెట్టి చూశాడు.

"ఎలా ఉంది?" అంది సూర్యముఖి.

సూర్యారావలాగే ఆమె వంక చూస్తూండిపోయాడు.

"ఇదంతా నటన. నాకు తెలుసు. త్వరగా మాట్లాడండి...." అంది సూర్యముఖి గోముగా.

"నీ తెలివి అమోఘం. నా గురించి నీకు తెలియని విశేషం లేదు—" అన్నాడు సూర్యారావు.

"ఎలా ఉన్నానో చెప్పండి—" అంది సూర్యముఖి.

"ఒకే ముక్కలో చెప్పాలంటే — నీ అందానికి దాసోహం!"

"అయితే నాతో సినిమాకి వస్తారా?"

"రాగలిగితే ఇంత మంచి అవకాశం వదులు కుంటానా?"

"నాకు తెలుసు. మీరేం చేసినా యేదో కారణ ముంటుంది!"

"అంటే?"

"మీరు నాతో సినిమాకు రానన్నారు. అందుకేదో కారణముంది...."

"ఇంకా...."

"మన కార్లోనే వెళ్ళమన్నారు. అందుకూ యేదో కారణముంది..."

"ఊఁ"

"అదీ నల్లకారు తీసుకువెళ్ళమన్నారు...."

"ఇంకా నెమళ్ళ బోర్డరు నీలం చీర కట్టుకోమన్నాను. వీటన్నింటికీకూడా యేవో కారణాలుంటాయి. అవేమిటో నువ్వే ఊహించి చెప్పకూడదూ?" అన్నాడు సూర్యారావు విషయాన్ని తేల్చేయడానికి ప్రయత్నిస్తూ.

"మీ తెలివి నా వూహాకందదు...." అంది సూర్యముఖి.

"నీ గురించి నేనూ అలాగే అనుకుంటాను...."

"నాకు తెలుసు. మనమిద్దరమూ ప్రేమికుల్లాకాక పోటీదారుల్లా ప్రవర్తిస్తున్నాం. మీ తెలివంటే నాకు, నా తెలివంటే మీకు గౌరవమున్నాయి. ఇద్దరిలో మీదే పైచేయి. నాది పైచేయి కావాలని నా ప్రయత్నం...."

సూర్యారావు నిట్టూర్చి—"నీకు అన్నీ తెలుసు—" అన్నాడు.

"నాకు అన్నీ తెలుసని మీరు నిజంగా నమ్మితే యే బాధా వుండదు. మీరు నన్ను పూర్తిగా నమ్మడంలేదు" అంది సూర్యముఖి.

"సూర్యా—నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అది నువ్వే నమ్మడం లేదు...." అన్నాడు సూర్యారావు.

సూర్యముఖి నిట్టూర్చి—"మనం ఒకరంటే ఒకరు

ఇష్టపడి పెళ్ళిచేసుకున్నాం. అయితే పెళ్ళిచేసుకున్నాక సరైన ఏకాంతమే కరువయింది. వ్యాపారం పేరుచెప్పి మీరు. క్లబ్బుల పేరు చెప్పి నేను బిజీగా వుంటున్నాం. ఒకరిమీద ఒకరికి అనుమానం. ఒకరంటే ఒకరికి అసంతృప్తి. ఒకరినొకరు అర్థం చేసుకుందుకుకూడా టైము లేదు. కానీ ఒకరితో ఒకరు పోటీ పడుతున్నాం — తెలివి తేటల విషయంలో....ఇలా ఎంతకాలమో తెలీకుండు.." అంది.

"ఇలా ఎంతకాలమో సాగదని హామీ ఇస్తున్నాను" అని మనసులో అనుకున్నాడు సూర్యారావు.

# 3

"హలో — రేవతీ.... నేను రాజకుమార్‌ని మాట్లాడుతున్నాను...."

"హలో రాజ్!" అంది రేవతి ఉత్సాహంగా.

"ఎప్పుడొస్తావ్?"

"ఈ వేళ సినిమాకి వెడుతున్నాను...."

"వాటే డిజపాయింట్‌మెంట్?....పోనీ యే సినిమాకు వెడుతున్నావో చెప్పు.... నేను వస్తాను...."

"నీకా ఛాన్సు లేదు. నాతో పాటు ఇంకొకరున్నారు"

"నీ భర్త టూర్లో వున్నాడుగా...."

"అవుననుకో...."

"ప్లీజ్.... రేవతీ! నాకోసం ఆ మనిషికి సెలవిచ్చేసేయ్. ఇంటి దగ్గర నీకోసం ఎదురుచూస్తూంటాను...."

రేవతి సాలోచనగా — "అయితే సినిమా మధ్యలో లేచివస్తానులే...." అంది.

"మరి నీతో యెవరొస్తున్నారంటున్నావు!"

రేవతి నవ్వి — "అదంతా నేను చూసుకుంటాన్లే...."

అని ఫోన్ పెట్టేసేసరికి సూర్యముఖి అక్కడకు వచ్చింది.

"అరే — అప్పుడే వచ్చేశావే ..." అంది రేవతి.

"అప్పుడే అంటున్నావు. నన్నింకా ఎక్స్‌పెక్ట్ చేయడంలేదా?" అంది సూర్యముఖి నవ్వుతూ.

"అది కాదు. ఇప్పుడే నీకు ఫోన్ చేయాలనుకుంటున్నాను...."

"ఎందుకు?"

"నీ కారు వద్దు. నా కార్లో వెడదామని. కానీ ఈలోగా నువ్వు రానే వచ్చేశావు...." అంది రేవతి.

"ఇంతలో యేమయింది? మావారు ఆలస్యం పెట్టడం వల్ల యిద్దరం కలిసి బయల్దేరాం...."

"అరే — మరి అయన్నెందుకు లోపలకు తీసుకురాలేదేం?" అంది రేవతి నొచ్చుకుంటూ.

"ఆయన వెళ్ళిపోయారు...."

"ఎలా వెళ్ళారు?"

"కార్లో...."

"అయితే బాధలేదు. కాగల కార్యం గంధర్వులే తీర్చారు. మనం నా కారులోనే వెళ్లొచ్చునన్నమాట.."

"అబ్బే.... నా కారుండి...."

"అదెలా సాధ్యం?"

"ఇద్దరం చెరో కార్లో బయల్దేరాం...."

రేవతి నవ్వి — "కలిసి బయల్దేరడమంటే అదా?" అంది.

సూర్యముఖి కూడా నవ్వి — "ఆ విషయం తర్వాత చెబుతానుగానీ ముందు నీ సంగతి చెప్పు. నీ కార్లో నే ఎందుకు వెళ్ళాలి?" అంది.

"రాజకుమార్ ఫోను చేశాడు.... ఇప్పుడే!"

"అయ్ సీ...." అని సూర్యముఖి నిట్టూర్చి—"హి యీజ్ వెరీ స్మార్ట్ గై...." అంది.

"రమ్మన్నాక వెళ్ళకపోతే బాధపడతాడు...." అంది రేవతి.

"అయితే?"

"మనమిద్దరం సినిమా ప్రోగ్రాం వేసుకున్నాం కదా- ఈ ప్రోగ్రాం పాడు చేసుకోవడం నాకిష్టంలేదు. రాజకుమార్ ఇంటికి రేపు వెళ్ళొచ్చనుకున్నాను. కానీ అలా చేస్తే అతడికిష్టముండదు. అందుకే సినిమాకు నా కార్లో బయల్దేరి—కాసేపు హాల్లో కూర్చుని అప్పుడు అతడింటికి వెడదామని నా ఉద్దేశ్యం...." అంది రేవతి.

"అంటే మళ్ళీ నన్ను అతడింటికి తీసుకు వెళ్ళాలనా?"

"అవును. వాటే ప్లెజంట్ సర్ప్రైజ్—అనుకోవాలి అతడు...."

"నీ యిష్టమేనా—నా యిష్టమేమీ లేదా?"

"నీ యిష్టం నాకు తెలియదనుకుంటున్నావా?"

"రేవతీ—...." అంది సూర్యముఖి—"నువ్వు నన్ను గురించి యేమనుకుంటున్నావో నాకర్థం కావడం లేదు..."

"ఈ కబుర్లన్నీ నా దగ్గరే.... అతణ్ణి చూస్తే వెన్నలా కరిగిపోతావు".

సూర్యముఖి నిట్టూర్చి—"నువ్వు చెప్పింది నిజం...." అంది.

"నా మాట కాదనకు. మనిద్దరం కలిసి నా కార్లో వెడదాం ..."

"లాభంలేదు. మనం నా కార్లోనే వెళ్ళాలి...."

"ఎందుకు?"

"నా భర్త వట్టి అనుమానం మనిషి...."

"అంతే?"

"నేను రాజకుమార్‌ని కలుసుకుంటున్నట్లాయనకు తెలిసిందేమోనని నా అనుమానం...."

"పోనీ__విషయం చెప్పేయలేకపోయావా?"

"నన్ననుమానించే మనిషిముందు అపరాధిలా నిలబడి సంజాయిషీ యిచ్చుకోవడం నా తత్వానికి సరిపడదు.."

"పోనీ నేను చెప్పేదా?"

"చెప్పినా అర్థం చేసుకునేటంత విశాల హృదయం ఆయనకు లేదు...." అంది సూర్యముఖి.

"ఆయన్నునువ్వు సరిగా అర్థం చేసుకోవడంలేదేమో?"

"అర్థం చేసుకున్నాను కాబట్టే నా పట్టుదల పెరిగి పోతోంది...."

"ఏమర్థం చేసుకున్నావో నాకు చెప్పు...."

"ఆయనకు వేరే ఆడపరిచయాలున్నాయి. తన ప్రవర్తన మంచిదికాదు కాబట్టి నన్ననుమానిస్తున్నారు" అంది సూర్యముఖి.

"చాలా నమ్మకంగా చెబుతున్నావు ..."

"ఆయన ప్రియురాలి యిల్లుకూడా తెలుసు నాకు. ఆమె పేరు మల్లిక...." అంది సూర్యముఖి.

"ఇంకా ఏం తెలుసో చెప్పు...."

"వద్దులే...." అంది సూర్యముఖి.

రేవతికూడా ఆమెను నొక్కించకుండా__"మనకింకా చాలా టయిముంది. కాస్త విషయం తేల్చి చెప్పు...." అంది.

"నా కార్లోనే వెడదాం...." అంది సూర్యముఖి.

"ఎందుకని?"

"ఆయనకు నామీద చాలా అనుమానం. సినిమా

కంటే నిజంగా వెడతానో వెళ్ళనో అని తను దగ్గరుండి బయల్దేరదీసి నీ యింటిదాకా వచ్చారు...."

"అంత అనుమానం మనిషైతే డ్రైవరుకి చెప్పి ఉంచేవారేమో కదా! ఏదో వంక పెట్టి నిన్ను సెల్ఫ డ్రైవింగు చేయకుండా ఆపేవారేమో!"

"అమ్మో! అలాంటి విషయాల్లో ఆయనది చాలా తెలివి. ఇంటి వ్యవహారం డ్రైవర్లకు తెలియకూడదు. నేను తప్పుగా తిరుగుతూంటే అది మా యింటి డ్రైవరుకు తెలుస్తుందనే — ఆయన సెల్ఫ డ్రైవింగు అవకాశం నాకిచ్చారు...."

"ఏమిటో—అంతా వింతగా ఉంది ..."

"అంతేకాదు. ఆయన నేను ఈ చీర కట్టుకోవాలని బలవంతపెట్టారు. నల్లకార్లోనే వెళ్ళాలని నొక్కించారు, అంటే థియేటరువద్ద ఆయన మనిషెవడో నన్ను గమనిస్తాడు. వాడికి నా కారు నంబరు, ఈ చీర గుర్తు అయుంటాయి. మనం కార్లో సినిమాకి వెళ్ళకపోతే పట్టుబడిపోతాం...."

"అయితే మాత్రం నీకు భయమెందుకు?"

"భయంకాదు. పట్టుదల...."

"అంటే?"

"ఆయన ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా నా విషయం తెలుసుకోలేరని ఋజావు చేయాలి. ఆయన ప్రతి ఎత్తూ ఆయనకే హెచ్చరిక కావాలి...."

"అంటే?"

"మనం నా కార్లోనే వెడతాం. నేనీ చీరే కట్టుకుంటాను. ఇద్దరం థియేటర్లో ప్రవేశించి మన సీట్లలో

కూర్చుంటాం...."

"తర్వాత...."

సూర్యముఖి తన పథకం వివరించి చెప్పి—"ఆయనకు ద్రోహం కాకుండా తప్పు చేయడం నాకూ తెలుసు..." అంది.

4

కూతురికి జడ అల్లుతూ —. "నువ్వు సాహసం చేస్తున్నావేమోనని నాకనుమానంగా వుందమ్మా...." అంది పార్వతి.

"లేదమ్మా — నేను వేయబోయే ప్రతి అడుగూ చూచి చూచి వేస్తాను. నా గురించి బెంగ పెట్టుకోకు...." అంది మల్లిక.

"అతడికి పెళ్ళైనదంటున్నావు. నిన్ను మళ్ళీ పెళ్ళేలా చేసుకుంటాడు?" అనుమానంగా అంది పార్వతి.

"అతడి భార్యకు క్యాన్సరుట. ఏ క్షణంలోనైనా పోవచ్చుట...."

పార్వతి నిట్టూర్చి—"అతడి భార్యకూడా నీ వయసుదే అయివుంటుంది. అయితే గియితే నీకంటే రెండు మూడేళ్ళు పెద్దుంటుంది. ఆమెకు క్యాన్సరేమిటి?" అంది.

"క్యాన్సరుకు వయసేమిటమ్మా...." అంది మల్లిక.

"అది సరే.... కానీ.... అవతల భార్య క్యాన్సరుతో వుంటే ఇవతల నీతో ప్రేమకలాపాలు సాగించే మనిషి నమ్మదగ్గవాడేనా?" అంది పార్వతి.

"అదంతా పెద్ద కథ...." అంది మల్లిక.

"కాస్త చిన్నది చేసి చెప్పు. నేనూ తెలుసుకుంటాను."

"అతన్ని ఆమె చిన్నప్పట్నించీ ప్రేమించింది. అతడికీ ఆమెకూ దూరపు బంధుత్వముండడంవల్ల పెద్దలుకూడా ఈ పెళ్ళి జరగాలనే అనుకున్నారు. అతడు పెద్దయ్యాక

తన మనసా మైపు ఆకర్షించబడడంలేదని గ్రహించి ఆ విషయం ఆమెకు చెప్పేశాడు. పెద్దలుకూడా అతణ్ణి బలవంతపెట్టకూడదనుకున్నారు.

అతడు లేని జీవితం ఆమె భరించలేననుకొని ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. నిద్రమాత్రలు మింగిందని డాక్టరు దగ్గరికి తీసుకొని వెడితే ఆమెకు క్యాన్సరుందన్న విషయం బైటపడింది. డాక్టర్లామె రెండు మూడేళ్ళకంటే బ్రతకదని తేల్చేశారు. ఆ పరిస్థితుల్లో అతడామెను పెళ్ళిచేసుకోవడం తప్పనిసరి అయింది. ఒక అభాగ్యురాలి అంతిమ కోరిక తీరుస్తానన్న భావన తప్ప అతడిలో మరో వాంఛలేదు....” అంది మల్లిక.

“వాళ్ళ పెళ్ళై ఎంతకాలమయింది?” అంది పార్వతి.

“రెండున్నర యేళ్ళు ...”

“నువ్వామెను చూశావా?”

“లేదు. కానీ ఎందుకు?”

“పెళ్ళైన మగాడు—పెళ్ళికాని ఆడపిల్లకిలాంటి కథ చెప్పాడంటే అందులోని నిజానిజాలు పెళ్ళాన్ని చూసి తెలుసుకోవచ్చు....”

“ఈ కథ నువ్వు నమ్మడం లేదా?”

“నీ వయసులో వుంటే నమ్మేదాన్ని....”

“ఈ వయసులో నీకేమనిపిస్తోంది?”

“నీ వయసులో వాళ్ళను హెచ్చరించాలని....”

“అమ్మా—ఏమిటి నీ భయం?” అంది మల్లిక.

“అతడు నిన్ను మోసం చేస్తున్నాడు!”

“మోసంచేస్తే యేమవుతుంది?”

“సీత తెలియదా?”

"నాకు తెలిసింది నువ్వు నమ్మడంలేదు...."

"నీకు తెలిసిన దేమిటి?"

"అతడి భార్య చావడం తథ్యా. అటుపైన మా యిద్దరి పెళ్ళికూడా తథ్యం—" అంది మల్లిక.

"అతడు తన భార్య చావు పేరు చెప్పి నీ నూరేళ్ళ జీవితాన్ని పాడుచేస్తాడు...." అంది పార్వతి.

"అమ్మా!" అంది మల్లిక — "జీవితంలో పైకి పోవాలన్న కోరిక నాకుంది. అతడే అందుకు ఆలంబన. నువ్వు శల్యసారధ్యం చేయకు...."

"శల్యసారధ్యం కాదమ్మా! నీ మేలు కోరినదాన్ని. నా మాట విను. అతడు బాగా వున్నవాడంటున్నావు. అలాంటి వాళ్ళు త్యాగంచేసి క్యాన్సరుతో వున్న పిల్లల్ని చేసుకోరు. అతడికా పిల్లద్వారా బాగా ఆస్తి కలిసుండాలి. లేదా ఆమెకు క్యాన్సరుండి వుండదు. తనే చంపడానికేదో పథకం వేస్తున్నాడు. అలాంటివాణ్ణి పెళ్ళిచేసుకొని నువ్వు సుఖపడలేవు. మరో పిల్ల వలలో పడి నిన్నూ చంపాలనుకుంటాడు. నా మాట విని పెద్ద పరుగులకు పోకు. ప్రాణాలకే మోసం వస్తుంది...."

"నా ప్రాణాలనెలా కాపాడుకోవాలో నాకు తెలుసమ్మా!" అంది మల్లిక.

"అన్నీ తెలుసనుకునేవారే తప్పటడుగులు వేస్తారు."

సరిగ్గా అప్పుడే యింటిముందు కారాగిన చప్పుడయింది.

"నాకోసం కారు పంపుతానన్నాడు. అదే అయుంటుంది. చూడమ్మా—నేనెలాంటి పథకం వేశానో నీకు తెలియదు...." అంటూ వీధిలోకి పరుగెత్తింది మల్లిక.

# 5

థియేటర్ మురళీకి ముందున్న కిళ్ళీకొట్టు దగ్గర నిలబడి వున్నాడు రమణ. అక్కడికి వస్తున్న ప్రతి కారునూ తీక్షణంగా పరీక్షిస్తున్నాడతడు. చూస్తూండగా నల్ల రంగు కారొకటి ఆగింది. రమణ నంబరును జాగ్రత్తగా చూశాడు. APW 9872.

అతడి కళ్ళు మెరిశాయి. కుతూహలంగా కారు వంకే చూస్తున్నాడు.

కారులోంచి ఇద్దరు యువతులు దిగారు. అందులో ఒకామె లేత నీలం రంగు చీర ధరించింది.

రమణ కిళ్ళీకొట్టు దగ్గర్నుంచి కదిలి ఆ యువతులను సమీపించాడు. లేత నీలం రంగు చీరకు నెమళ్ళ బోర్డరుంది.

"అమ్మాయి చాలా బాగుంది—" అనుకున్నాడు రమణ.

సూర్యముఖి నవ్వుతూ రేవతితో యేమో మాట్లాడుతోంది.

"ఆమె నవ్వు మనోహరం...." అనుకున్నాడు రమణ మళ్ళీ.

యువతులిద్దరూ థియేటర్లోకి నడిచారు. రమణ వారి ననుసరించే లోపలకు వెళ్ళాడు. వాళ్ళకతణ్ని పట్టించుకోలేదు.

హాల్లో దీపాలింకా వెలుగుతున్నాయి. పాశ్చాత్య సంగీతం స్టీరియోలో సన్నగా వినపడుతోంది.

బ్యాటరీ లైటుతో ఒక బాయ్ యువతులిద్దరినీ సమీపించాడు. వాళ్ళు టికెట్స్ చూపించారు.

హెచ్ రోలో పదకొండు, పన్నెండు వాళ్ళ

నంబర్లు. సెమళ్ళ బోర్డరు యువతి చివరి సీట్లో కూర్చుంది. అది నంబరు పదకొండు. అట్నుంచి ఆ వరుసలో మొదటి సీటది. ఇట్నుంచి ఆఖరు సీటు. రెండో యువతి ఆమె పక్కనే పన్నెండో నంబరు సీట్లో కూర్చుంది.

బాయ్ టార్చిలైటుతో రమణ దగ్గరకు వచ్చాడు. అతడి నంబరు జీ పదకొండు.

సరిగ్గా లేత నీలం రంగు చీర యువతి వెనకనే కూర్చున్నాడతడు. మనసులో తన తెలివి తేటల్ని తనే అభినందించుకున్నాడు.

హాల్లో ఒక వరుసకు ముప్పైనాలుగు సీట్లున్నాయి. వరుస మూడు భాగాలుగా విభజించబడింది. అటూ యిటూ పది సీట్లు, మధ్యన పద్నాలుగు.

సూర్యారావునుంచి సమాచారం అందగానే అతడు మొత్తం ఇరవై ఎనిమిది టికెట్సు రెండు వరుసల్లో వచ్చేలా కొనమని ఓ మిత్రుడికి చెప్పాడు. అలా కొన్న టికెట్సులో రెండు వరుసల్లోనూ పదకొండు, పన్నెండు నంబర్లు మాత్రం వుంచుకొని మిగతావి వెంటనే అమ్మించేశాడు. ఒక సెట్టు సూర్యారావుకు పంపాడు. రెండో సెట్లో పదకొండో నంబరు టికెట్ మాత్రం వుంచుకొని పన్నెండో నంబరు టికెట్ కూడా అమ్మేశాడు.

తను సరిగా అనుకున్న నంబరుకు వెనక్కు వస్తేనే తన పని సులభమవుతుంది. నీలం రంగు చీర యువతి పదకొండో నంబరు సీట్లో కూర్చోవాలని అతడు కోరుకున్నాడు. అలాగే జరిగింది.

"అంతా సక్రమంగానే వుంది—" అనుకున్నాడతడు.

# 6

"డియర్-నామీద నీకప్పుడే మోజు తీరిపోయిందా?" అంది చేతన గోముగా.

సూర్యారావు మంచంమీద కూర్చున్నాడు. చేతన అతడి ఒడిలో వాలి వుంది. ఆమె అతడి ముఖంకేసి చూస్తూ చేతులతో అతడి బుగ్గలపై మృదువుగా రాస్తోంది.

"మోజు తీరిపోవడానికి నువ్వు నా భార్యవు కావు గదా!"

"ఏం_నీకప్పుడే నీ భార్యపై మోజు తీరిపోయిందా?"

సూర్యారావదోలా ముఖం పెట్టి — "పెళ్ళిచేసుకోని చాలా తప్పు పని చేశాననిపిస్తోంది—" అన్నాడు.

"ఏం?"

"పెళ్ళిచేసుకుంటే నాపై సర్వ హక్కులూ సంపాదించేశాననుకుంటుంది భార్య. నాకింకా యెన్నో సరదాలున్నాయి...."

"అసలు నువ్వు పెళ్ళెందుకు చేసుకున్నావు?"

"ఆమె అంటే వెర్రి ఆకర్షణ బయల్దేరింది. ఆమె లేకపోతే నా బ్రతుకే వృథా అనిపించింది. ఆమెను పొందడానికి పెళ్ళి తప్ప వేరే మార్గం లేకపోయేసరికి పెళ్ళిచేసుకున్నాను. పెళ్ళైన మర్నాటినుంచే ఆమె నాపై అధార్టీ ప్రారంభించింది. నేనెక్కడెక్కడికి వెళ్ళిందీ తనకు చెప్పాలి. ఎవరెవరిని కలుసుకున్నదీ చెప్పాలి. ఏమేం చేసిందీ చెప్పాలి. ఇంటికి రావడం కుణం ఆలస్యమైతే సంజాయిషీ యిచ్చుకోవాలి...."

"ఏం చేస్తావ్? అలాగే సర్దుకుపోతున్నావా?"

"లేదు. నేను నా పద్ధతులేమీ మార్చుకోలేదు...."

"మరి నీ భార్య ఊరుకుందా?"

"కొన్నాళ్ళు దెబ్బలాడింది. ఫలితం కనబడలేదు. ఆ తర్వాత కొన్నాళ్ళు తనలో తనే గొణుక్కునేది. నేను పట్టించుకోలేదు. అప్పుడు చివరి అస్త్రం ప్రయోగించింది. అది మామూలు అస్త్రం కాదు. అణ్వస్త్రం...."

"ఏమిటది?" కుతూహలంగా అడిగింది చేతన.

"తనూ నాకులాగే ఉండడం మొదలు పెట్టింది—"

"శభాష్...." అంటూ చేతన చప్పట్లు కొట్టింది.

"ఏం — వేళాకోళంగా వుందా నీకు?" కోపంగా అన్నాడు సూర్యారావు.

"ఇందులో వేళాకోళమేముంది? నీ సమస్య సులభంగా తీరిపోయిందని సంతోషిస్తున్నాను...." అంది చేతన.

"సమస్య తీరడమేమిటి—ఇక్కడే ప్రారంభమయింది...."

"నీ భార్యకూడా నీకులాగుంటే సమస్యేముందింక?"

"నా భార్య యింటిపట్టున వుండాలి. నేను చెప్పిన చోట్లకే వెళ్ళాలి. నా మాట కాదనకూడదు. ముఖ్యంగా వేరే మగ పరిచయాలుండకూడదు...."

"చాలా అన్యాయం. నీకో రూలు....నీ భార్యకో రూలు...."

"ఇందులో అన్యాయముండవచ్చు. కానీ నీ బోటి వాళ్ళది అన్యాయమనడంలో న్యాయంలేదు. ఎందుకంటే మీ బ్రతుకంతా ఈ అన్యాయంలోనే వుంది...."

"అదేమిటో చెప్పు....కాస్త వివరంగా వింటాను.."

"చెప్పడెందుకులే?" అన్నాడు సూర్యారావు.

"ఎందుకంటే — పురుషుడు సుఖంకోసం పరాయి

ఆడదాన్ని మరుగుతాడు. అంతా ఆ ఆడది ఆ మగాణ్ని తలలో వేసుకుంటుందంటారు. తప్పుచేసేది మగాడు. తిప్పు పట్టేది ఆడదాన్ని. నావంటి వారివద్ద సుఖం పొందుతూ నన్ను నిరసించడం నాకు నచ్చలేదు. అందుకు తగిన కారణం చెప్పకపోతే మన పరిచయానికీ రోజుతో స్వస్తి". అంది చేతన.

"చేతనా-నువ్వు నన్ను తప్పుగా అర్థం చేసుకొన్నావు" అన్నాడు సూర్యారావు—"ఆడవాళ్ళపై ఎన్నో హద్దులున్నాయి. స్త్రీ ఆ హద్దుల్నతిక్రమించలేదు. అందులోనే ఆమెకూ సుఖశాంతులుండడంవల్ల అందుకామె తలవంచింది. స్త్రీ లక్షణంగా హద్దుల్లోనే వుండడంవల్ల పురుషుడికామె అంటే ఆకర్షణ పెరిగిపోతోంది. అందుకని పురుషుడు—ఆ హద్దులకు లొంగని కొందరు స్వతంత్ర స్త్రీల చుట్టూ తిరుగుతాడు. నాకో రూలు, నా భార్యకో రూలు కాకపోతే నేను నీ చుట్టూ యింత విచ్చలవిడిగా తిరిగేవాడిని కాదు...."

"నువ్వు చెప్పింది నిజం. కానీ నీ భార్యకూడా హద్దు తప్పింది. ఏం చేస్తావ్?"

"అందరికీ అన్నీ వంటబట్టవు. మా కుటుంబంలో నా భార్య నన్నాదరించడానికి తానెన్నుకున్న పద్ధతి— కాన్సరై ఆమెను బాధిస్తుంది. ఆమెకు అకాలమరణం తప్పదు—" అన్నాడు సూర్యారావు గంభీరంగా.

"అంటే?"

"నా భార్యింక యెంతో కాలం బ్రతకదని డాక్టర్లు చెప్పారు...."

"చెప్పినవాళ్ళు నిజంగా డాక్టర్లా? అలా చెప్పారు కదా అని వాళ్ళను నువ్వు డాక్టర్లంటున్నావా?" అంది

చేతన.

సూర్యారావు వంగి మృదువుగా ఆమె నుదుటిమీద ముద్దు పెట్టుకొని—"ఆడదానికి తెలివి అచ్చిరాదు. ఏ విషయమూ మరీ లోతుగా ఆలోచించకు...." అన్నాడు.

"నీ భార్య చచ్చిపోతుందా?" అంది చేతన.

సూర్యారావు మాట్లాడలేదు.

"చచ్చిపోతే ఏం చేస్తావ్?"

"మళ్ళీ పెళ్ళి చేసుకుంటాను...." అన్నాడు సూర్యారావు తాపీగా.

"నువ్వు మళ్ళీ పెళ్ళిచేసుకుంటే—నన్నే చేసుకో.." అంది చేతన.

సూర్యారావు నవ్వి—"నువ్వు పెళ్ళి గురించి ఆలోచించకు...." అన్నాడు.

చేతన చిరుకోపంతో—"ఏం—నేను పెళ్ళికి పనికి రానా?" అంది.

"ఏమో నాకు తెలియదు. కానీ నువ్వు కావాలను కున్నాను. అందుకు పెళ్ళి అవసరం లేకపోయింది...."

"అదన్నమాట నా తప్పు...."

"తప్పో ఒప్పో నాకు తెలియదు. కానీ నాకు పెళ్ళైనా నీ దగ్గరకు రావడానికి అభ్యంతర పెట్టని అమ్మాయిని పెళ్ళిచేసుకుంటాను...."

"నువ్వెవరితో తిరిగినా నేనూ అభ్యంతర పెట్టను...."

"కానీ నా విషయంలో చెప్పావుగా. మగాడికో రూలు ఆడదానికో రూలు. నాకులా ఉండని అమ్మాయినే చేసుకుంటాను. ఆ అమ్మాయి కింతవరకూ నేను తప్ప పర పురుషుడి స్పర్శ అనుభవంలోకి రాదు...."

"అలాంటివాళ్ళు నీకు దొరకరు...."

"ఆల్ రెడీ అమ్మాయి సిద్ధంగా వుంది. ఇంక నా భార్య చావడమే తరువాయి...." అన్నాడు సూర్యారావు.

"ఎవరా అమ్మాయి?"

"కాసేపట్లో కార్లో ఇక్కడికి వస్తుంది. ఇద్దరం కలిసి ఎక్కడికో వెడతాం. సరదాగా గడుపుతాం...." అన్నాడు సూర్యారావు.

"అందుకా—ఈ పూట అంటీ ముట్టనట్లున్నావు...."

"అవును...."

"ఆ అమ్మాయి పెళ్ళయ్యాక నీ మాట వింటుందని నమ్మకమేమిటి?"

"నా భార్య డబ్బులో పుట్టింది. హోదాలో పెరిగింది. ఆమె నేనంటే యిష్టపడ్డానికి కారణం కేవలం నేనే! కానీ ఈ అమ్మాయిలా కాదు. పేదరికంలో పుట్టి పెరిగి ఐశ్వర్యం కోసం కలలు కంటోంది. ఆమె నన్ను కాక నా డబ్బునీ, హోదాను ప్రేమిస్తోంది. పెళ్ళయ్యాక ఆ రెండూ నిలబెట్టుకోవడంకోసం—నేనెలా తిరిగినా సహిస్తుంది...."

చేతన నవ్వి—"ఆడదాని గురించి నీకు బొత్తిగా తెలియదు. పెళ్ళయ్యాక నీ భార్య డబ్బు, హోదాతో పాటు నిన్ను కూడా కలిపి బిగిస్తుంది—" అంది.

"బిగిస్తే తనే అనుభవిస్తుంది. నేను పొమ్మంటే పూటకు ఠికానా వుండదా అమ్మాయికి—" నవ్వుతూ అన్నాడు సూర్యారావు.

"ఆమెకు నీకు పెళ్ళయిన విషయం తెలుసా?"

"తెలుసు. ఆమె కూడా నా భార్య చావు కోసం

ఎదురుచూస్తాం....."

"నీ భార్య చనిపోతుందంటే ఆమె భయపడ లేదా?...."

సూర్యారావామెకు సూర్యముఖి క్యాన్సరు తమ పెళ్ళికి దారితీసిన కథ చెప్పి—"ఇది తెలిసేక ఆమెకు నేనంటే సానుభూతి కూడా పెరిగింది—" అన్నాడు.

"ఈ కథ నామె నమ్మిందా?"

"నమ్మినట్లే కనబడింది. నమ్మకపోయినా నే ఆమెకు భవిష్యత్తుంది...."

"మీ పరిచయమై ఎంత కాలమయింది?"

"ఆరు మాసాలు...."

"ఇంకా నీ కామెపై మోజు తీరలేదు...."

"మోజు తీరడానికామె లొంగితే కదా...."

"ఓహో—అదా సంగతి!" అని నవ్వి—"ఒకవేళ నీ భార్య చావలేదనుకో. అప్పుడు నువ్వా అమ్మాయి నేం చేస్తావు?" అంది.

"ఎలాగో మధ్య పెట్టి లొంగదీసుకుని వదిలేస్తాను...."

"పూర్ గర్ల్....ఆమె పేరేమిటో?"

"మల్లిక...." అన్నాడు సూర్యారావు.

సరిగ్గా అప్పుడే ఆ యింటి ముందు కారొకటాగింది.

# 7

హాల్లో దీపా లారాయి. షైడ్సు ప్రారంభ మయ్యాయి.

రమణ జేబులు తడుముకున్నాడు. ప్రత్యేకమైన పిస్టల్ అతడి చేతికి తగిలింది. అది అతడికోసం ప్రత్యేకంగా తెప్పించాడు గుప్తా.

ఇంజక్షన్ సిరంజిలా వుంటుందది. అందులో రెండు కంపార్టుమెంట్సుంటాయి. ఒకదానిలో మత్తు మందు, రెండో దాంట్లో విషం.

సిరంజికి రెండు బటన్సుంటాయి. కుడివైపు బటన్ నొక్కితే మత్తుమందుతో నిండిన సన్నని అంగుళం సూది బయటకు వస్తుంది. ఫోర్స్ యెక్కువ వుండదు. ఆ సూది చర్మానికి తగిలి క్రింద పడిపోతుంది. అది తగిలిన వారికి చీమో, దోమో కుట్టినట్లవుతుంది. రియాక్షన్ లో గా మనిషి బిగుసుకుపోతాడు.

ఎడంవైపు బటన్ నొక్కితే విషంతో నిండిన సూది బయటకు వస్తుంది తగిలిన వెంటనే మనిషికి ఇంతా అంతా అనరాని బాధ కలుగుతుంది. ఆ తర్వాత ప్రాణం పోవడానికి కొద్ది సెకన్లు మాత్రం. బాధ కలిగినప్పుడు మనిషి అరవకుండా వుండడానికే మత్తుమందు.

మనిషికి గుచ్చుకునే ఆ సూదులు లోహంతో చేసినవి కావు. ఒక రకమైన ప్లాస్టిక్. క్రిందపడిన కాసేపటికి కారతికర్పూరంలా మారించుకుపోతాయవి.

ఆ సిరంజి పిస్టల్ సాయంతో నిశ్శబ్దంగా హత్య జరుగుతుంది. పక్కనున్నవాడికి కూడా తెలియకుండా హతుడి చరిత్ర ముగుస్తుంది. అటువైన ఆధారాలేమీ మిగలవు.

సూర్యముఖిని చంపడానికదే యెన్నుకున్నాడు రమణ.

"ఇంటర్వెల్ తర్వాతగానీ చంపొద్దన్నాడు. అదేమి పరతో?" అని మనసులో విసుక్కున్నాడు రమణ. అయితే అతడు సూర్యారావు చెప్పిన మాటలు తూచా తప్పకుండా పాటించదల్చుకున్నాడు. అది అతడి వృత్తి

ధర్మం.

స్లైడ్స్ అయిపోయాయి. అడ్వర్ టైజ్ మెంట్స్ ప్రారంభమయ్యాయి.

రమణ ముందున్న సీట్లలోని యిద్దరు యువతులూ లేచి నిలబడ్డారు. హాల్లోంచి బయటకు వెడుతున్నారు.

"ఇప్పుడేం చేయాలి?" అనుకున్నాడు రమణ.

వాళ్ళు బయటకు వెళ్ళి తిరిగివస్తారో రారో? సూర్యారావు చెప్పిన ప్రకారం అతడు ఇంటర్వెల్ తర్వాతనే నీలం చీర యువతిని హత్య చేయాలి. అదీ థియేటర్లోనే!

రమణ లేవలేదు. కానీ చీకట్లో కూడా ఆ యువతి ధరించిన నీలం చీరని గుర్తుంచుకుందుకు ప్రయత్నించాడు. అస్పష్టంగా అగుపిస్తున్న గుర్తుల్ని నోట్ చేసుకున్నాడు. నెమళ్ళ బోర్డరు ప్రత్యేకంగా నెమలి అని తెలియక పోయినా చీకట్లో కూడా తెలుస్తోంది.

"వీళ్ళిద్దరూ తిరిగివచ్చేక సీట్లు మారితే ఆ విషయం చీకట్లోనే గుర్తించాలి—...." అనుకున్నాడు రమణ.

వరుసగా అడ్వర్టయిజ్ మెంట్లు నడుస్తున్నాయి. అలా పదినిముషాలు గడిచేక న్యూస్ రీలు ప్రారంభమైంది.

ఆ యువతులింకా తిరిగిరాలేదు.

రమణకు టెంక పట్టుకుంది.

వారికి తన గురించి అనుమానం వచ్చిందా! లేక తనపై హత్యాప్రయత్నం జరుగవచ్చునని సూర్యారావు భార్యకు తెలిసిందా? ఎలా తెలుస్తుంది?

సూర్యారావే విషయం ఇంకెవరికైనా చెప్పాడేమో. డైరీలో రాసుకున్నాడేమో!

న్యూస్ రీలు కూడా అయిపోయింది.

అప్పుడు న్యూస్ షోగా నడుస్తున్న ఓ చిత్రం తాలూకు పాట ట్రయిలర్ గా చూపిస్తున్నారు. రమణకది బుర్ర లోకి ఎక్కడంలేదు.

ట్రయిలర్ అయిపోతోంది. సినిమా ప్రారంభంకా నున్నదన్నట్లుగా బెల్ మ్రోగింది.

రమణలో ఆత్రుత పెరిగిపోతోంది.

సినిమాకని వచ్చినవాళ్ళు—అది ప్రారంభమయ్యే సమయానికి లేకుండా యెందుకు బయటకు వెడతారు?

ఇందులో యేదో తిరకాసుంది....

రమణ యేం చేయాలా అనుకుంటూండగా యిద్దరు యువతులూ తిరిగివచ్చారు. అతడి మనసు తేలికపడింది.

కొండ గుర్తుల్నిబట్టి నీలం చీర, నెమళ్ళ బోర్డరు గుర్తుపట్టాడు. ఆమె తిరిగి పదకొండో నెంబరు సీట్లోనె కూర్చుంది.

"హమ్మయ్యా!" అనుకున్నాడు రమణ. అతడు మరో సారి జేబులు తడుముకున్నాడు. నీరంజి పిస్టల్ చేతికి తగిలింది.

ఇప్పుడతడు యింటర్వెల్ యెప్పుడవుతుందా అని యెదురుచూస్తున్నాడు. సినిమా ప్రారంభమయింది.

# 8

ఉత్తరం మాత్రమే వచ్చింది. అందులో మల్లిక లేదు.

డ్రైవర్ సూర్యారావుకో ఉత్తరం ఇచ్చాడు.

"డియర్! నిన్ను డిజప్పాయింట్ చేయను. నువ్వు కోరిన ప్రకారం డైరెక్ట్ గా చంపక్ హోటల్ కు వస్తున్నాను. నీ కార్లో రావడంలేదు.

రిసెప్షనిస్టు దగ్గర తాళం తీసుకుని డార్క్ రూంలో వుంటాను. త్వరగా బయల్దేరి అనుకున్న టైముకిరా.

నీ

మల్లిక."

ఇదీ ఆ ఉత్తరంలోని విశేషం.

సూర్యారావు మనసు ఆనందంతో ఉరకలు వేసింది. కారెక్కి — "చంపక్ హోటల్ కు పోనియ్...." అన్నాడు.

చేతన అతడికి టాటా చెప్పింది.

కారు అయిదునిముషాల్లో హోటలు చేరుకుంది.

"మళ్ళీ రాత్రి పదింటికి రా—..." అని డ్రైవరుకి చెప్పి కారు దిగి లోపలకు నడిచాడు సూర్యారావు. హోటల్ చంపక్ ముందు తన కారు పార్కు చేసి తన ఉనికి ప్రత్యేకంగా తెలియజేయడం అతడి కిష్టంలేదు. రాత్రి పదింటికి డ్రైవరొస్తే తిరిగి చేతన యింటికే వెళ్ళి-అక్కణ్ణించి తను బయల్దేరిన కార్లోనే యిల్లు చేరాలని అతడి ఉద్దేశ్యం.

హోటల్ చంపక్ కా ఊళ్ళో ప్రత్యేకత వుంది. అదే డార్క్ రూం సదుపాయం.

మామూలుగా చూస్తే కనపడని తలుపు గోడకు అమర్చబడి వుంటుంది. ఆ గోడలోపల వుంటుంది డార్క్ రూం.

డార్క్ రూంలో కన్ను పొడుచుకున్నా కానరాని చీకటి.

ప్రేమికులకా గది అదో అనుభవం.

మల్లిక నెంతగానో కన్విన్స్ చేసి ఆ రాత్రికా గది బుక్ చేశాడు సూర్యారావు. డార్క్ రూం చీకటిని

గురించి విన్నాక మల్లిక అందు కంగీకరించింది. అయితే ముందుగానే ఆమె అక్కడికి వెళ్ళిందంటే డార్క్‌రూం గురించి ధృవపర్చుకోవాలనుకుని వుంటుందామె.

ఆ గది తాళం ఆమెకూ యిచ్చాడతడు.

సూర్యారావు ఉత్సాహంగా తన గదికి వెళ్ళాడు.

గది గోడకు పిడిలా అతుక్కుని వున్న టెలిఫోన్ డయల్ లాంటి వస్తువును సమీపించాడు.

నిజాని కది తలుపు తాళం. తెరుచుకు నేందుకు నెంబర్ కోడ్ వుంటుంది. రోజూ రోజూకూ ఆ కోడ్ నెంబరు మారిపోతుంది.

ఆ రోజు కోడ్ నెంబరు 76532108.

సూర్యారావు నెంబరు తిప్పాడు. తలుపు తెరుచు కుంది.

అదే నెంబరు మల్లికకూ తెలుసు. కానీ ఇప్పుడు మల్లిక లోపల వుందా?

లోపలకు సన్నగా వెలుతురు పడుతోంది. అక్కడ అడ్డంగా మరో గోడ వుంది. ఆ గోడలో ఓ తలుపుంది. ఆ తలుపు తెరుచుకోవాలంటే యీ తలుపు మూసు కోవాలి.

సూర్యారావు లోపలకు వెళ్ళాడు. తలుపు మూశాడు. అప్పుడు రెండో తలుపు తెరుచుకుంది. కన్ను పొడుచు కున్నా కానరాని చీకటి. ఆ చీకట్లో అతడు గదిలో ప్రవేశించి—"మల్లికా!" అన్నాడు.

"ఊఁ" అన్నదో తీయని గొంతు.

సూర్యారావు శరీరం పులకరించింది.

"మల్లికా—నువ్వు నిజంగా వచ్చావా?"

"ఊఁ" అన్నది మళ్ళీ అదే గొంతు.

అతడా గొంతు ననుసరించి మల్లికను సమీపించాడు.

"మల్లికా — నువ్వు రావనుకున్నాను. నిజంగా వచ్చావు...."

"నేను ప్రేమను నమ్మాను. నీలో ప్రేమను చూసి నిన్ను నమ్మాను. ఇది నా నమ్మకాన్ని నీకు తెలియజెప్పడం కోసం. పెళ్ళయ్యేవరకూ ఇదే మన మొదటిదీ ఆఖరిదీ అయిన కలయిక...." అంది మల్లిక.

"ఒప్పుకుంటున్నాను మల్లికా! నువ్వు దేవతలా నన్ను కరుణించావు. నీ ఋణం యెలా తీర్చుకోగలను?" అన్నాడు సూర్యారావు.

"పెళ్ళి సంగతి గుర్తుంచుకో....అంతే చాలు...."

"అలాగే మల్లికా—...." అంటూ అతడామెను దగ్గరగా తీసుకుని—"నీ స్వర్శలో యెంత సుఖముంది?" అన్నాడు.

ఆమె అతడి నడుంచుట్టూ చేతులు వేసింది.

సూర్యారావామె ముఖాన్ని తన రెండు చేతుల్లోకీ తీసుకుని—"ఇప్పుడు నేను నీ కళ్ళలోకి చూడగలిగితే ఎంత బాగుండేదీ?" అన్నాడు.

"ఆ అదృష్టం పెళ్ళయినవాళ్ళకే!" అంది మల్లిక.

"మన పెళ్ళి. త్వరగా జరగాలి. అందుకు ముహూర్తం సమీపించిందనే నమ్ముతున్నాను—" అన్నాడు సూర్యారావు.

మల్లిక మాట్లాడలేదు. సూర్యారావుకూ మాటలవసరమనిపించలేదు. కొత్త అనుభవం కోసం అతడి మనసు ఉరకలు వేస్తోంది.

"అరే—మీరా?" అన్నాడు రాజకుమార్ ఉత్సాహంగా.

"ప్లెజంట్ సర్‌ప్రయిజ్....అవునా?" అంది రేవతి.

"రేవతీ — థాంక్సలాట్...." అన్నాడు రాజకుమార్.

"మరీ అంత ఉత్సాహం పనికిరాదు...." అంది రేవతి నవ్వుతూ.

"రండి—కూర్చుందాం...." అన్నాడు రాజకుమార్.

అందరూ సోఫాల్లో కూర్చున్నారు.

"పేక దాచేస్తాను...." అన్నాడు రాజకుమార్.

"అంటే నేనేం చేయను?"

"విడియో చూడు....కొత్త ఇంగ్లీషు సినిమా. మంచి కామెడీ...." అన్నాడు రాజకుమార్.

"మంచో, చెడో—చూడ్డం తప్పదుగా...." అంది రేవతి.

రాజకుమార్ ఆమెకోసం అప్పటికప్పుడు విడియో యేర్పాటు చేసి—"మరి మాకు సెలవా?" అన్నాడు.

"ఊఁ కానీ త్వరగా వచ్చేయాలి...."

"సినిమా అయేలోగా వచ్చేస్తాం...."

"సినిమా ఎంతసేపుంటుంది?"

"గంటా నలభై నిముషాలు...."

"సరే—టాటా...." అంది రేవతి.

రాజకుమార్, సూర్యముఖి పక్కగదిలోకి నడిచారు. రాజకుమార్ తనే తలుపులు వేశాడు.

"మీకు చాలా తొందర...." అంది సూర్యముఖి.

"ఏ తొందరైనా మిమ్మల్ని చూసినప్పుడే కదా!"

అన్నాడు రాజకుమార్. అతడు దిగులుగా నిట్టూర్చాడు కూడా.

"ఏకాంతంలో కూడా నన్ను మీరని మన్నించడ మెందుకు?" అంది సూర్యముఖి నవ్వడానికి ప్రయత్నిస్తూ.

"ఏమో — కారణం నాకు తెలియదు. నాకు మీ రంటే గౌరవభావం. మీరు నా కంటే అధికులనీ, నా జీవితగతిని మార్చడానికి వచ్చిన దేవత అనీ అనిపిస్తుంది. మిమ్మల్ని గౌరవించడాని కింకో పద్ధతి తెలియక మీరని మన్నిస్తున్నాను. కాదనకండి...."

"నీ యిష్టం...." అంది సూర్యముఖి నిట్టూర్చుతూ.

అతడామెకు దగ్గరగా వచ్చి ఆమె ముఖాన్ని రెండు చేతుల్లోకి తీసుకుని ముఖమంతా ముద్దులతో నింపాడు.

ఆమె అలాగే నిలబడి వుంది.

అతడామెను కౌగలించుకుని నడుం నిమురుతున్నాడు.

ఆమె అలాగే నిలబడి వుంది.

ఉన్నట్లుండి అతడామెను వదిలిపెట్టి — "నేను తప్పు చేస్తున్నాను కదూ!" అన్నాడు.

"లేదు —" అందామె దృఢంగా.

"మీకు వివాహమైంది. మీకింత దగ్గరగా రావడం తప్పుకాదూ?"

"నీ విషయంలో కాదు...."

"ఊరికే నన్నూరట పర్చడానికి మీ రలాగంటున్నారు...."

"కాదు. నిజం చెబుతున్నాను...."

"నేను నమ్మను...."

"నమ్మించడానికి నేనేం చేయాలి?" అందామె.

"ఏం చేయాలో చెబితే చేస్తారా?"

"నామీద నమ్మకం లేదా?"

"ఉంది—కానీ చెప్పడానికి భయమేస్తోంది...."

"ఫరవాలేదు—చెప్పు...."

"నాకు మీ సహజసౌందర్యాన్ని చూడాలనుంది—" అన్నాడతడు తటపటాయిస్తూనే.

ఆమె నవ్వి—"సహజసౌందర్యమంటే?" అంది.

"అది....మీరు ధరించిన దుస్తులలో కప్పబడింది..."

"ఓస్ ఇంతేనా? నీ కోసం ఏమైనా చేయగలను...." అందామె తేలికగా.

అతడు మాట్లాడలేదు. ఆమె అతడివంకే చూస్తోంది. అతడప్పుడు నార్మల్‌గా లేడు. ఉద్రేకపడుతున్నట్లు తెలుస్తోంది.

"నేను నిజం చెబుతున్నాను....ప్రస్తుతానికి నేను నీ దాన్ని...."

"నాలో ఏ విశేషముందని...."

"వర్ణించడానికి నేను కవయిత్రిని కాను. కానీ మన్మథుడికి రూపకల్పన చేస్తే నీకులాగే ఉంటాడనిపిస్తుంది" అంది సూర్యముఖి.

"మీ నోటినుంచి యిలాంటి పొగడ్తలు వింటూంటే యెంతో బాగుంటుంది...." అన్నాడు రాజకుమార్.

"ఇవి పొగడ్తలు కావు. ఉన్నమాటే చెప్పాను నేను...."

"నిజంగా నేను మిమ్మల్ని కోరిన విధంగా చూడొచ్చా?"

"ఊఁ."

"నిజంగానా?"

"మరీ మరీ అడగొద్దు. నాకు సిగ్గేస్తుంది...." అంది సూర్యముఖి.

"నా ముందు మీరు సిగ్గుపడతారా? ఎందుకు?"

"చూడు....నువ్వు పురుషుడివి. నేను స్త్రీని. అందుకే సిగ్గు...."

అతడి ముఖంలో ఉద్రేకం పెరిగింది—"మీరు దేవత. విశాలహృదయం మీది...."

"అందుకు నన్ను కాదు—నా భర్త నభినందించాలి" అనాలనుకున్నదామె. కానీ ఆ మాటలామె పెదవి దాటి బయటకు రాలేదు.

రాజకుమార్ ఆమెను సమీపించి భుజంమీద చేయి వేశాడు. ఆమె కళ్ళు మూసుకుంది.

"కళ్లు మూసుకున్నారేం?" అన్నాడతడు.

"నాకు సిగ్గేస్తోంది—" అంది సూర్యముఖి.

రాజకుమార్‌లో ఉత్సాహం పెరిగింది.

# 10

ఇంటర్వెల్లో లైట్లు వెలగడానికి ముందే రమణ హాల్లోంచి బైటకు వెళ్ళిపోయాడు. తన పక్క వ్యక్తికి తన ముఖాన్ని గుర్తుంచుకోవడం అతడి కిష్టంలేదు. మళ్ళీ లైట్లు ఆరేకనే లోపలికి వచ్చాడతడు.

ఆ యువతులిద్దరు సీట్లు కదలలేదు. యథాస్థానాల్లోనే వున్నారు. మళ్ళీ సినిమా ప్రారంభంకాగానే రమణ ఆమెనే శ్రద్ధగా గమనించసాగాడు.

ఆమె ఒక చేతిని ఎడంవైపుకు వదిలిపెట్టింది. ఆ చేయి లోపలకు తీసుకున్నప్పుడు మనిషి నిటారుగా కూర్చుంటోంది. నిటారుగా కూర్చున్నప్పుడామె భుజాలు కాస్త పైకి వస్తున్నాయి.

"వీలు చూసుకొని యిక్కడో అక్కడో కొట్టాలి" అనుకున్నాడు రమణ. ఎవరికీ అనుమానం రాకుండా కొట్టాలంటే ఎడంపక్కకు వ్రేలాడే చేయి ఎక్కువ వీలని అతడికనిపిస్తోంది.

అతడు సినిమా చూడడంలేదు. ఆమె కదలికలనే గమనిస్తున్నాడు. సినిమా చూస్తే ఆ ధ్యాసలో పడి వచ్చిన పని మరిచిపోతానేమోనని అతడి భయం.

ఏ టైములో ఆమెను చంపాలీ అన్న విషయంకూడా అతడాలోచిస్తున్నాడు. సినిమా అయ్యేవరకూ ఆమె చనిపోయిన విషయం యెవరికీ తెలియకూడదు. అలా తెలిస్తే అంతా హడావుడి. హాల్లో వాళ్ళెవరినీ బయటకు వెళ్ళనివ్వరు. పెర్చికూడా జరగవచ్చు.

అందుకే అతడు మంచి టైముకోసం చూస్తున్నాడు.

అతడి అదృష్టమేమిటంటే ఆ యువతులిద్దరు ఒకరితో ఒకరు మాట్లాడకుండా యెవరిమటుకు వారు శ్రద్ధగా సినిమా చూస్తున్నారు.

ఒక విధంగా అది తనకు అదృష్టమే!

ఇంటర్వెల్ తర్వాత పనికానిమ్మని చెప్పాడు సూర్యారావు. ఆ పని కాస్త ఆలస్యంగా చేయడం మంచిదా? ఇప్పుడే పూర్తిచేసుకోవడం మంచిదా?

సినిమా నడుస్తోంది.

రమణ ఆమెనే గమనిస్తున్నాడు.

అంతవరకూ నిటారుగా కూర్చున్న ఆమె కాస్త వంగి కూర్చుంది. ఎడంపక్క ఆమె చేయి బయటకు వ్రేలాడింది.

రమణ జేబులోంచి సిరంజి పిస్టల్ తీసి చుట్టూ చూశాడు. అతడినెవరూ గమనించడంలేదు. అప్పుడతి

డామె చేతివైపే దృష్టిని కేంద్రీకరించాడు.

ముందు చేయి అస్పష్టంగా కనబడింది. తర్వాత ఆ చేయి మిసమిసలాడుతూ పసిమి ఛాయలో మెరుస్తూ కనబడింది. క్రమంగా ఆ చేయి స్తంభమంత లావయింది. అటుపైన అదే మహా పర్వతమై కంటికింకేమీ కనబడకుండా పోయింది.

రమణ సిరంజి పిస్టన్లో ఓ బటన్ నొక్కాడు.

అతడి గురి తప్పలేదు.

ఆమె ఊఁ అని సన్నగా మూలిగింది. ఒకరు గురించి వినే మూలుగు కాదది. అతి సన్నగా యితరులెవ్వరికీ వినబడనంత సన్నగా వుంది.

ఆ వెనువెంటనే ఆమె శరీరంలో కదలిక ఆగిపోయింది.

ఆమెకు స్పృహ తప్పిందని అతడికర్థమయింది.

సిరంజిలో రెండో బటన్ నొక్కాడు రమణ.

## 11

"ఈ రోజుకింక సెలవిచ్చేసెయ్...." అంది సూర్యముఖి.

రాజకుమార్ ఆమె శరీరాన్నావేశంగా తడుముతూ-"అప్పుడేనా?" అన్నాడు.

"ప్లీజ్....ఇంకోసారి వచ్చినపుడు యొక్కువసేపుంటాను. బయట రేవతికూడా వుంది...." అంది సూర్యముఖి.

"నాకు మిమ్మల్ని వదలాలని లేదు...."

"నాకూ లేదు. కానీ తప్పదు కదా...."

ఆమె అతణ్ని మృదువుగా వదిలించుకొని త్వరగా బట్టలు వేసుకొని తలుపులు తీసుకొని గది బయటకు వెళ్ళింది.

ఆమె రాగానే వీడియో కట్టేసింది రేవతి.

"పిక్చర్ అయిపోయిందా?" అంది సూర్యముఖి.

"లేదు. చాలా బోరుగా వుంది. నువ్వెప్పుడొస్తావా అని చూస్తున్నాను...."

"వెళ్ళిపోదామా?" అంది సూర్యముఖి.

"రాజకుమార్ కి చెప్పి వెడదాం—" అంది రేవతి.

"అవసరం లేదు ..." అంది సూర్యముఖి.

"ఎలా వున్నాడు?" అంది రేవతి.

"నాకే ఆశ్చర్యంగా వుంది. అతడిలో చాలా గొప్ప మార్పు వచ్చింది...."

"సూర్యా! ఇందుకు నిజంగా నిన్నభినందించాలి. సాధారణంగా ఎవరూ ఇలా ఒప్పుకోరు...."

"నేనూ ఒప్పుకునేదాన్ని కాదు. ఇందుకు నువ్వే నన్నూ కాదు.... నా భర్త నభినందించాలి. అతని ప్రవర్తన నన్నిటు తిరిమింది. ప్రపంచంలో చెడ్డవల్ల కూడా మంచి జరిగే అవకాశముంటుందంటే నమ్మాలనిపిస్తోందిప్పుడు."

"పాపం—రాజకుమార్ .... అన్నివిధాలా నార్మల్. ఫుట్ బాల్ ఆటలో ఒకసారి వెల్లకిలా పడ్డాడు. వంటికి దెబ్బలేం తగల్లేదు. ఎక్కడా ఎముకలు విరగలేదు. ఏం జరిగిందో తెలియదు. అతడిలో స్త్రీ వాంఛ పోయింది. స్త్రీకి దూరంగా వుండాలన్న కోరిక పెరిగింది. ఆ బాధ నతడెవరికీ చెప్పుకోలేదు. మేమిద్దరం ప్రేమించుకున్నాం. ఈ కారణంగా మా పెళ్ళి ఆగిపోయింది. అతడంటే నాకు సానుభూతి వుంది. నా దగ్గర అతడికి రహస్యాలు లేవు. తన సమస్యను ఫ్రీగా చెప్పుకుంటాడు. అతడి గురించిన ఈ రహస్యం తిలిదండ్రులకూ్కడా తెలియదు."

"ఎన్నిసార్లు చెబుతావీ కథ....అతడు ఓ సెక్స్

స్పెషలిస్టుని సంప్రదించాడు. ఆ స్పెషలిస్టు అతడికి మాన సికంగా ప్రేరేపణ కావాలన్నాడు. అందుకో యువతిని ఎన్నుకోవాలన్నాడు. ఏ యువతిని చూస్తే అతడి మన సులో సంచలనం ప్రారంభమవుతుందో ఆ యువతి కార ణంగానే అతడిలో తిరిగి పురుషత్వం నిండగలదని ఆ డాక్టరు చెప్పాడు.

రాజకుమార్ మొదటిసారి నన్ను చూసినపుడు-తను కోరే యువతి నేనేనని గ్రహించాడు. అతణ్ని తిరిగి పరిపూర్ణ పురుషుడిగా మార్చడానికి నేను వేశ్యగా మసలి—అతడి యెదుట. మా యిద్దరికీ శారీరకంగా సంబంధంలేదు. అతడిలో మార్పు వస్తేకూడా శారీరక సంబంధముండదు. అతడు రోగి. నేను వైద్యుడు. ఈ సంబంధానికైనా యే సంసార స్త్రీ చటుక్కున ఒప్పు కోదు. నా భర్త ప్రవర్తన రాజకుమార్‌కి వరమయింది. అంతే కదా!" అంది సూర్యముఖి.

"ఇందుకు నేనే నిన్ను ప్రోత్సహించాను. నీకు కోపంగా లేదు కదా!" అంది రేవతి అనుమానంగా.

"నా కోపం గురించి ఆలోచించకు. త్వరలో నీ రాజ కుమార్ పెళ్ళికోసం కలవరించే రోజు వస్తోంది, మంచి పిల్లను చూడు...." అంది సూర్యముఖి.

"సరేలే-వాళ్ళ నాన్న ఆ పని ఎప్పుడో చేశాడు..." అని-"పద, పోదాం-" అంది రేవతి.

ఇద్దరూ బయటకు వచ్చారు. టాక్సీలో థియేటర్ మురళికి చేరుకున్నారు. రేవతి టైము చూసుకొని-"ఇంకో అయిదు నిమిషాల్లో లోపలున్న వాళ్లు బయటకు రావాలి. ఆ ఎదురింట్లోకి వెళ్ళి బట్టలు మార్చుకొని మనం థియే టర్లోకి వెళ్లాలి-" అంది.

ఆ ఎదురిల్లు రేవతి భర్త ఆఫీసు. అందులో ఓ గది యెప్పుడూ ఆమెకోసం ఖాళీగా వుంటుంది.

అయిదు నిమిషాల్లో ఓ అమ్మాయి లోపల్నించి బయటకు వచ్చి వారిని కలుసుకుంది.

"ఒక్కతెవే వచ్చావేం?" అంది రేవతి.

"ఆమె నేను లేవగానే నాతో బయల్దేరి వచ్చేస్తుందనుకున్నాను. కానీ వచ్చినట్లు లేదు...." అందా యువతి.

"సినిమా వదల్లేక పోతోందేమో...." అంది రేవతి.

"మీరు వెళ్ళి బట్టలు మార్చుకొని రండి.... నేనిక్కడే ఆమెకోసం ఎదురుచూస్తాను..." అంది సూర్యముఖి.

రేవతి, ఆ యువతి ఎదురింట్లోకి వెళ్ళి తిరిగి వచ్చారు. సూర్యముఖి ఇంకా అలాగే నిలబడి వుంది.

"ఆమె రాలేదా?"

"లేదు-మనమింక ఎదురుచూడవద్దు. వెళ్ళిపోదాం.."

"మరి నీ నెమళ్ళ బోర్డరు చీర...."

"ఆ సంగతి తర్వాత చూసుకుంటాను...."

ఇద్దరూ కార్లో తిరుగుప్రయాణమయ్యారు.

## 12

"సార్! ఇదెలా జరిగిందో నాకు తెలియదు. థియేటర్లో పోయిన యువతి మీ భార్య కాదు.... వేరెవరో?" అన్నాడు రమణ. తన పొరపాటుకు తన్ను తానే క్షమించుకోలేనన్న భావం అతడి కళ్ళలో కనబడుతోంది.

"దిగులుపడకు. నీ డబ్బు నీకిస్తాను. ఇలా జరుగుతుందని నాకు ముందే తెలుసు. ఈ హత్య కేవలం నా భార్యను హెచ్చరించడానికి మాత్రమే!" అన్నాడు సూర్యారావు.

"అంటే?" అన్నాడు రమణ ఆశ్చర్యంగా.

"నా భార్యను నేను చంపుకోలేను. అందుకే హత్యా ప్రయత్నం చేసినా ఆమెకు కొంత సూచన ముందుగా యిస్తాను. ఆ సూచన నందుకోగల తెలివి ఆమెకుంది. అయితే యేమాత్రం అశ్రద్ధగా వున్నా తన ప్రాణం పోతుందన్న భయం ఆమెకుండాలి. ఆ భయంలో ఆమె తన పద్ధతులను నాకు అనుకూలంగా మార్చుకుంటుంది."

కేవలం భార్యను భయపెట్టడానికి ఓ నిండు ప్రాణాన్ని తీయగల ఆ వ్యక్తి - వృత్తిరీత్యా హంతకుడైన రమణకు కూడా కిరాతకుడిలా గే కనబడ్డాడు. అయినా అతడేమీ మాట్లాడకుండా తన డబ్బు తీసుకొని వెళ్ళి పోయాడు.

♦ ♦ ♦

"హలో! సూర్యా .... నేను రేవతిని మాట్లాడుతున్నాను. ఏం జరిగిందో తెలుసా?"

"ఏమయింది?"

"మల్లిక థియేటర్లో చనిపోయిందిట ...."

"ఇలాంటిదేదో జరుగుతుందని నేను ముందే అనుమానించాను...." అంది సూర్యముఖి తాపీగా.

"వ్వాట్?" అంది రేవతి తెల్లబోయి.

"చూడు. మావారు మల్లికకోసం చంపక హోటల్లో డార్క్ రూం యేర్పాట్లు చేసుకున్నారు. మల్లిక తెలివైనది. అక్కడకు వేరే కాల్ గర్ల్‌ను పంపించింది. డబ్బిస్తామంటే మన స్థానంలో థియేటర్ లో కూర్చుంనుకు అంగీకరించింది...."

"అవును...."

"మావారిది అతి తెలివి. నన్నేదైనా చేయాల

నంటుంది. కానీ నేనేమైనా అయిపోతానేమోనని భయం. అందుకని యేదైనా తల పెట్టినప్పుడు పరోక్షంగా సూచనలు చేస్తారు. ఫలానా చీర కట్టుకొని ఫలానా కార్లో ఫలానా థియేటర్లో సినిమా చూడమన్నారంటే ఆ ఫలానా చీరలో వున్న యువతికి ప్రమాదమున్నదని అర్థం....అది ఆయన నాకు యిచ్చే సూచన. అప్పుడు నేను నా స్థానంలో మరో యువతిని ప్రవేశపెట్టి ఆయన నాకు తలపెట్టిన ప్రమాదమేదో తెలుసుకొంటాను. ఇలా ఇంతవరకూ మూడుసార్లు జరిగింది. ఇది నాలుగోసారి.."

"మొదటి మూడుసార్లూ ఏం జరిగింది?"

"మొదటిసారి దుండగులు యువతిని యెత్తుకొని పోయారు....తర్వాత నేను కాదని తెలిసి వదిలిపెట్టారు. రెండోసారి ఆమెచేత బలవంతంగా కొన్ని పత్రాలపై సంతకాలు పెట్టించుకొన్నారు. అవి చెల్లవని వారికి తెలియకపోయినా - మావారికి తెలుసు. మూడోసారి - ఓ యువతికి మానభంగం జరిగింది...."

"అయ్యో...." అంది రేవతి అప్రయత్నంగా.

"జాలిపడకు. ఆమె ఒక కాల్ గర్ల్. నేను మావారి మెదడును పుస్తకంలా చదవగలను. ఎప్పటికప్పుడు ఆయన తలపెట్టిన నేరం నాకు ముందుగానే తెలుస్తుంది. అందుకు తగ్గ యువతుల్నే ఎన్నుకొన్నాను నేను. ఈసారి హత్యా ప్రయత్నం జరుగుతుందని తెలుసు. అందుకే మల్లికను ఎన్నుకున్నాను...."

"అందువల్ల నువ్వు సాధించిన దేమిటి?"

"నా జోలికి రావాలనుకుంటే యెలాంటి యెదురు దెబ్బ తగులుతుందో ఆయనకు తెలియాలి గదా! మల్లిక చావుతో ఆయనకు రెండు విషయాలు అర్థమవుతాయి. ఒకటి

తన డార్క్ రూం అనుభవం మల్లికతో కాదని. రెండు— నా జోలికి రావడం ద్వారా మల్లిక తన కెప్పుడూ దక్కకుండా పోయిందని. బహుశా....ఇది ఆయనకు ఆఖరి హెచ్చరిక. దీంతో అన్ని విషయాల్లోనూ పైచేయి యెవరిదో ఆయనకు అర్థమవుతుంది..."

"కానీ....ఒక అమాయకురాలు మీ పోటీ పేరు చెప్పి—...."

"రేవతీ....బాధపడకు. ఈ తప్పు మనది కాదు. ఆయన తప్పు చేస్తుంటే హెచ్చరించాలనుకున్నాను. ఆయన హెచ్చరికను చెవిని పెట్టకుండా తప్పు చేశారు. అవునంటావా? కాదంటావా?"

"మల్లిక పోతుందేమోనని తెలిసి కూడా నువ్వు ప్రశాంతంగా యెలా వుండగలిగావు?" రేవతి ఆశ్చర్యంగా అడిగింది.

"నా మనసు నా విషయం నుంచి మళ్ళించడం కోసం నేను పూర్తిగా రాజకుమార్‌ని మనసులో నింపాను. నా ప్రవర్తన అతడికి ఆనందం కలిగించి వుండవచ్చు. అతడిలో కోరిన మార్పును తీసుకుని వచ్చి వుండవచ్చు. కానీ అప్పుడు నా ఉద్దేశ్యం వేరు. మల్లికను ప్రమాదంలో వదిలి వచ్చానన్న ఊహను నా మెదడు నుంచి తొలగించడమే...."

"నిన్నాశ్చర్యపరచాలని ఫోన్ చేస్తే నన్నాశ్చర్యపరిచావు. అన్నిట్లోనూ నీదే పైచేయి...." అని ఫోన్ పెట్టేసింది రేవతి.

సూర్యముఖి తనూ ఫోన్ పెట్టేసింది. కానీ వెంటనే మళ్ళీ ఫోన్ మ్రోగింది. "హలో!" అంది సూర్యముఖి రిసీవర్ తీసి.

"సూర్యా! నువ్వేనా.... నేను పోటీలో పూర్తిగా ఓడిపోయాను. ఇక ముందు మన మధ్య పోటీలు వద్దు. అన్నింట్లోనూ నీదే పైచేయి...." దీనంగావున్న ఆ గొంతు సూర్యారావుదని ఆమె గుర్తు పట్టింది.

ఫోన్ పెట్టేస్తూ—"పాపం—రాజకుమార్ అసలు కథ సూర్యారావు కిప్పుడు చెప్పొచ్చు—" అనుకుంది సూర్యముఖి.

—:అ యి పో యిం ది:—

# మరణ భీతి

## సుంకరి రాంప్రసాద్

విజయనగరం అయోధ్యా మైదానం విద్యుద్దీప కాంతులతో వెలిగిపోతూంది.

ప్రముఖ యువ ఛాయాగ్రాహకుడు రాజేంద్ర యొక్క 'ఫోటో ఎగ్జిబిషన్' ఆ మైదానంలో యేర్పాటు చేయబడింది. జిల్లా కలెక్టర్ శ్రీపతిరావు రిబ్బను కత్తిరించి ఎగ్జిబిషన్ ప్రారంభించాడు.

ఎగ్జిబిషన్ నిజంగా అద్భుతంగా వుంది. అపురూపమైన పక్షులు, జంతువుల ఫోటోలతోపాటు, మనోజ్ఞమైన ప్రకృతి దృశ్యాలు దర్శకుల కనువిందును చేస్తున్నాయి.

ముఖ్యంగా ఒక్కొక్క ఫీచర్ క్రింద ఆ భావాన్ని స్ఫురింపజేసే చిత్రాల అమరిక మరింత హృద్యంగా వుంది.

'ప్రసవ వేదన' అని వ్రాయబడ్డ కాప్షన్ క్రింద 'ఖడ్గమృగం' ప్రసవిస్తున్న దృశ్యం..ముఖ్యంగా అందులో

ఖడ్గమృగం ముఖంలో కన్పిస్తున్న బాధ.... చూపరులను విచలితులను చేస్తూంది.

అలాగే 'మాతృ ప్రేమ' అని వ్రాయబడ్డ కాప్షన్ క్రింద తన పిల్లల చిన్నారి ముక్కులకు ప్రేమతో ఆహారాన్ని అందిస్తున్న పక్షి చిత్రం, ఒక వానరం తన పిల్లను గుండెలకు హత్తుకొని స్తన్యం యిస్తున్న దృశ్యం. ఇలాగే ఎన్నో అద్భుతమైన చిత్రాలు...

పిల్లలను, సామాన్య ప్రజలను ఈ చిత్రాలు ఆకర్షిస్తుంటే చదువుకున్నవారిని, ముఖ్యంగా ఫోటోగ్రఫీ పట్ల అభిరుచి ఉన్నవారిని ఆకర్షిస్తున్నది ఇంకో ప్రత్యేక చిత్రాల ప్రదర్శన.

అది 'మరణ భీతి' అన్న ఫీచర్ క్రింద అమర్చబడ్డ చిత్రాలు.

మరణం ఆసన్నమయిందని తెలిసిన క్షణాల్లో.... వివిధ రకాల స్త్రీ పురుషుల ముఖాలలో, కన్నులలో ప్రతిఫలించే భయం.... భీతి మొదలగు భావాలను సజీవంగా చూపిస్తున్న చిత్రాలవి.

వాటిని ఎలా సేకరించాడో గాని.... నిజంగా 'హేట్స్ ఆఫ్ టు రాజేంద్ర' అనుకున్నారు ఆ ప్రదర్శన చూసిన ప్రతి ఒక్కరూ.

మొదట కేవలం మూడు రోజుల పాటు నిర్వహిద్దామనుకున్న ఆ ఫోటో ఎగ్జిబిషన్ను పురప్రజల కోరిక మీదట మరో రెండురోజుల పాటు పొడిగించడానికి అంగీకరించాడు రాజేంద్ర.

అయితే.... పొడిగించబడ్డ ఆ రెండు రోజులలో ఆ ఎగ్జిబిషన్ చూడడానికి ఒక వ్యక్తి రావడంతో

రాజేంద్ర కొన్ని అనూహ్యమైన సంఘటనలను యెదుర్కోవలసి వచ్చింది. అలాంటి పరిస్థితి వస్తుందని ఏమాత్రం ముందుగా ఊహించినా రాజేంద్ర తన ఫోటో ఎగ్జిబిషన్‌ను పొడిగించడానికి అంగీకరించేవాడు కాదు.

ఆ వ్యక్తి రాంకుమార్....సి.బి.ఐ. ఆఫీసర్.

విశాఖపట్టణంలోని 'యోగాశ్రమం' నడుపుతున్న దొంగ బాబాను పట్టించాక, ఆ కేసును పూర్తి వివరాలతో ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌కు అప్పగించి, ఢిల్లీకి ప్రయాణం కాబోతూ....తన కాలేజ్ మేట్ గోవిందరావు ఆహ్వానించడంతో విజయనగరం వచ్చాడు రాంకుమార్.

రాంకుమార్, గోవిందరావు విజయనగరం మహారాజా కాలేజ్‌లో బి.కాం చదువుతూండగా స్నేహితులయ్యారు. మూడు సంవత్సరాల పాటు అవిచ్ఛిన్నంగా సాగిపోయింది వారి స్నేహయాత్ర. ఇద్దరి అభిప్రాయాలూ, అభిరుచులూ ఒక్కటే కావడంతో ప్రాణస్నేహితులయ్యారు వారు.

ఇద్దరకూ మొదటినుండీ 'నేర పరిశోధన' అంటే ఓ ప్రత్యేకమయిన యిష్టం ఉండటంచేత, ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఎగ్జామ్స్‌కు వెళ్ళటం, సెలక్ట్ అయ్యాక పోలీస్ శాఖలో ప్రవేశించడం జరిగింది.

తరువాత రాంకుమార్ సి.బి.ఐ. ఆఫీసర్ అయి, ఢిల్లీ వెళ్ళిపోయాడు గోవిందరావుకు సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌గా విజయనగరంలోనే పోస్టింగ్ రావటం, పెళ్ళిచేసుకొని విజయనగరంలోనే ఫ్యామిలీని పెట్టడం జరిగింది.

స్నేహితుని పెళ్ళికి రాలేకపోయాడు రాంకుమార్. అందుకే అత్యవసరంగా ఢిల్లీ వెళ్ళాల్సి వున్నా, స్నేహి

తుని మాటను కాదనలేక విజయనగరం వచ్చాడు.

ఆ రోజు సాయంత్రం స్నేహితులిద్దరూ 'రాజేంద్ర' ఫోటో ఎగ్జిబిషన్‌కు వెళ్ళారు. గోవిందరావు అంతకు ముందే ఒకసారి ఆ ఎగ్జిబిషన్‌ను చూసినా, స్నేహితుని కోసం మరోసారి వచ్చాడు.

అద్భుతమూ, అపురూపమూ అయిన ఆ చిత్ర ప్రపంచం లోనికి అడుగుపెట్టాక తమనుతాము మరచిపోయారు ఆ స్నేహితులిద్దరూ.

'ప్రకృతిలోని అందాలను, పశు పక్ష్యాదుల మూగ జీవితపుటానందాన్ని తన చిన్న కెమెరాలో బంధించి... యిక్కడ ... ఆ చిన్న రంగుల దేరాలో ప్రదర్శిస్తు న్నాడా ఈ యువ ఛాయాగ్రాహకుడు'....అని అనిపిం చింది రాంకుమార్ కు.

తను వెంటే వస్తూ ఆన్నీ విపులీకరిస్తున్న రాజేంద్ర భుజాన్ని ప్రశంసాపూర్వకంగా తట్టాడు రాంకుమార్.

ఎగ్జిబిషన్ లోని చివరి బ్లాక్ లోనికి ప్రవేశించారు వారు. అక్కడ వున్నవి 'మరణ భీతి' చిత్రాలు.

ఆ చిత్రాలను చూస్తుంటే ఫోటోగ్రాఫర్ గా రాజేంద్ర యెంతో యెదిగిపోయినట్లు అనిపిస్తూంది. ఒక్కొక్క చిత్రాన్ని చూస్తూ ముందుకు నడుస్తున్నారు వారు.

నడుస్తున్న రాంకుమార్ టక్కున బ్రేక్ వేసినట్లు ఆగి పోయాడు. అతని చూపులన్నీ ఒక పెద్ద ఫోటోపైన కేంద్రీకరింపబడి వున్నాయి.

అది 12 × 24 అంగుళాల సైజులో ఉన్న ఫోటో. అయితే అంత పెద్ద ఫోటోలోనూ కన్పిస్తున్నవి కేవలం రెండు కళ్ళు మాత్రమే. భయంతో బాగా విప్పార్చ

కొని ఉన్నట్లు వున్నాయి ఆ కళ్ళు.

"బ్యూటిఫుల్ ఐస్.... అండ్ ఎ మార్వెలస్ ఎక్స్‌ప్రెషన్ మిష్టర్ రాజేంద్రా! యెవరిదీ ఫోటో....!" రాజేంద్రవైపు చూస్తూ అడిగాడు రాంకుమార్.

"అది.... అది.... సరిగ్గా గుర్తులేదు సర్"—మెల్లగా గొణుగుతున్నట్లు చెప్పాడు రాజేంద్ర.

ఎంత అణచుకున్నా దాగని కలవరపాటు రాజేంద్ర కళ్ళల్లో కదలాడింది. అదీ కేవలం ఒక్క క్షణం. అంతే!

అయితే ఆ కలవరపాటు రాంకుమార్ పోలీస్ కళ్ళను మాత్రం తప్పించుకు పోలేకపోయింది. రాంకుమార్ రాజేంద్రను పాలోచనగా చూశాడు.

ఇప్పుడు రాంకుమార్ ఆలోచిస్తున్నది రాజేంద్ర ఎందుకు ఉలిక్కిపడ్డాడని కాదు. అలాంటి కళ్ళనే తను యెక్కడో చూశాడు. యెక్కడ....? యెక్కడయి వుంటుంది....? యెంత ప్రయత్నించినా అది గుర్తుకు రావటంలేదు.

అలా ఆలోచిస్తూ అయిదారు అడుగులు వేశాక.... గిరుక్కున వెనుతిరిగి వచ్చి మరలా ఆ ఫోటో వంకే తదేకంగా చూడసాగాడు రాంకుమార్.

అతని మస్తిష్కంలో ఏదో రూపం అస్పష్టంగా కదులుతూంది.

"మిష్టర్ రాజేంద్రా..! ఈ ఫోటో ఎప్పుడు, ఎక్కడ తీశారో చెప్పగలరా?"

రాజేంద్ర విసుగ్గా చూశాడు. 'ప్రజారంజకమైన కళనుకూడా మీ పోలీసులు నేర దృష్టితోనే చూస్తారు సుమా!' అన్నట్లుంది అతని చూపు. అతని ముఖం మాత్రం యే భావమూ లేకుండా నిర్లిప్తంగా వుంది.

"సారీ....సర్! చెప్పలేను. ఐ మాస్ట్ సర్రులేదు. నేను ఈ ఫోటో ఎగ్జిబిషన్ పెట్టడంకోసం కొన్ని సంవత్సరాలుగా ప్రయత్నిస్తున్నాను. ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి....ఎన్నో ప్రదేశాలు తిరిగి....రకరకాల ఫోటోలను తీసి భద్రపరుస్తున్నాను. వాటిలో ఈ ఫోటో యెప్పుడు, ఎక్కడ తీశానో గుర్తుంచుకొని చెప్పడమంటే నో....ఇటీజ్ ఇంపాజిబుల్" రాజేంద్ర గొంతు దృఢంగా పలికింది.

ఆ ఫోటో గురించి యే విషయమైనా చెప్పడానికి రాజేంద్ర సుముఖంగా లేడని రాంకుమార్‌కు అర్థమయింది. ఎందుకు? ఆ ఫోటోలో ఏమైనా మిస్టరీ వుందా? ఆ ఫోటో గురించి అడిగేసరికి రాజేంద్ర యెందుకు కలవరపడ్డాడు?

అన్నీ ప్రశ్నలే!... జవాబులు దొరకని ప్రశ్నలు.

రాంకుమార్ సిక్స్‌సెన్స్....ఇందులో యేదో మెలిక వుందని చెబుతూంది. అంతూ పొంతూ లేని ఆలోచనలతోనే ఎగ్జిబిషన్ బైటకు నడిచాడు రాంకుమార్.

## 2

ఆ రోజు రాత్రి 'సప్పర్' తీసుకున్నాక లాన్‌లో వేయబడ్డ కుర్చీలలో కూర్చున్నారు మిత్రులిద్దరూ. వారి ఎదురుగా వున్న వెండిపళ్ళెంలో తమలపాకులు, సున్నం, వగైరా తాంబూల సామాగ్రి వుంది.

రెండు వక్కలు, ఏలక్కాయ నోటిలో వేసుకొన్నాడు రాంకుమార్. గోవిందరావు తమలపాకులకు ఈనెలు తీసి సున్నం వ్రాసుకోసాగాడు.

"గోవిందా....నాకు రాజేంద్ర గురించి కొన్ని వివరాలు కావాలి. అదీ రేపటిలోగా—" నెమ్మదిగా

అన్నాడు రాంకుమార్.

"ఇంతకు క్రితమే అడుగుదామనుకున్నాను. అసలు నీ సందేహం యేమిటి? వాట్ ఆర్ యూ సస్పెక్టింగ్?" చిన్నగా నవ్వుతూ అడిగాడు గోవిందరావు.

"ఆ ఫోటో నువ్వుకూడా చూశావు కదా. అదే 'మరణ భీతి' ఆ జంట కన్నుల ఫోటో" గోవిందరావు వైపే సాలోచనగా చూస్తూ అన్నాడు రాంకుమార్.

'చూశాను' అన్నట్లు తలూపాడు గోవిందరావు.

"నీకేం అనిపించింది?" అడిగాడు రాంకుమార్.

రాంకుమార్ వంక ప్రశ్నార్థకంగా చూశాడు గోవిందరావు.

రాంకుమార్ చిన్నగా నవ్వి, చెప్పసాగాడు.

"గోవిందా! ఆ ఫోటో చూసిన క్షణంలో ఎందుకో అది రియల్ ఎక్స్‌ప్రెషన్ అనిపించింది. వియామ్ చని పోతున్న మనిషి కళ్ళల్లో కనిపించే భయం. 'మరణ భీతి'. హౌ దిస్ ఫోటోగ్రాఫర్ కుడ్ గెట్ దట్ రేర్ ఎక్స్‌ప్రెషన్....మరణం ఆసన్నమయిన క్షణంలో బహుశా ఆ ఫోటో తీయబడి వుండాలి. ఆ కళ్ళలోని భయం, విప్పార్చుకొని ఉన్న ఆ కనుగ్రుడ్లను చూస్తుంటే ఎందుకో అది సహజ మరణం కాదు అనిపిస్తుంది నాకు. అది హత్య కానీ, ఆత్మహత్య కానీ, సహజమరణం కానీ, ఆ సమయంలో రాజేంద్ర అక్కడ యెందుకు వున్నాడు? ఒకవేళ ఉండివుంటే....ఒక మనిషి మరణాన్ని అంత సులువుగా మరచిపోయాడా?

నెవ్వర్....! అంటే .... అతడు ఆ విషయం....ఆ ఫోటో వివరాలు చెప్పడానికి యిష్టపడటంలేదు. అదే... ఎందుకు....?"

రాంకుమార్ లాజిక్‌కు నిజంగా మతిపోయింది గోవిందరావుకు. 'ఎంతయినా సి. బి. ఐ. బుర్ర' అనుకున్నాడు.

"ఆ ఫోటో వెనుక ఒక మరణం వుంది. ఆ మరణం సంభవించిన క్షణంలో రాజేంద్ర అక్కడే వున్నాడు. ఇది నిర్వివాదాంశం. దెన్ వై ఈజ్ హి హైడింగ్ దట్ ట్రూత్....? అది తేలాలంటే రాజేంద్ర గత చరిత్ర తెలుసుకోవాలి."

తను చెప్పాల్సింది పూర్తయినట్లు పేముకుర్చీలో రిలాక్సింగ్‌గా వెనక్కు వాలాడు రాంకుమార్.

## 3

మరునాడు ఉదయం పదిగంటలకల్లా రాంకుమార్ చేతికి ఒక ఫైల్ అందించాడు గోవిందరావు. అది రాజేంద్ర గురించి పూర్తి వివరాలున్న ఫైలు.

'గుడ్ వర్క్' అన్నట్లు చిన్నగా నవ్వుతూ చూశాడు రాంకుమార్.

అయితే రాంకుమార్ ఆశించినట్లు ఆ ఫైలులో రాజేంద్రను అనుమానించదగ్గ విషయాలేమీ లేవు. రాజేంద్ర కెక్కువగా స్నేహితులుకూడా లేరు. ఎంత సేపూ తనూ, తన ఫోటోగ్రఫీ. అంతే!

ఇతరుల విషయాలలో జోక్యం కూడా చేసుకోనే వాడు కాదని, యింటి బాడుగ మాత్రం సరిగ్గా నెల పూర్తయ్యేసరికి చెల్లించేవాడని.... రాజేంద్ర అద్దెకుంటున్న యింటి యజమాని రిపోర్టు. అతని కాలేజ్ లైఫ్ కూడా యే రిమార్క్సు లేకుండా వుంది.

రాజేంద్రకి నా అనేవారు ఎవరూ లేరు. హాస్టల్‌లో వుండి చదువుకొనేవాడు. అతని తల్లిదండ్రుల గురించి

వివరాలు తెలియవు.

అంతవరకూ చదివి విసుగ్గా ఫైలు మూసేయబోతున్న క్షణంలో రాంకుమార్‌ను ఆకర్షించింది ఒక వాక్యం.

అది.... రాజేంద్ర గురించి ఫైలులో వ్రాయబడ్డ ఆఖరి వాక్యం.

'ఈ మధ్యకాలంలో రాజేంద్ర తరచుగా విశాఖ పట్టణం వెళ్ళుతున్నాడట. ఒక్కొక్కసారి రెండు, మూడు రోజులు 'విశాఖ లోనే వుంటున్నాడట.'

చాలా సాధారణ విషయ మిది. కాని ఎందుకో రాం కుమార్‌ని ఈ చిన్న వాక్యం ఆకర్షించింది.

ఫైలును గోవిందరావు కందజేస్తూ.... రేపటి తమ కార్యక్రమాన్ని చెప్పాడు రాంకుమార్.

'హాయిగా గడుపుదామనుకున్న ఈ రెండు రోజులూ ....ఎందుకొచ్చిన లేనిపోని తంటా' అనుకున్నాడు గోవిందరావు.

కాని రాంకుమార్ స్వభావం తెలుసు కాబట్టి మౌనంగా ఊరుకొన్నాడు. రాంకుమార్ కనుమానం రాదు. వచ్చిందంటే దాని అంతు చూడందే వదలి పెట్టడు.

'తను గడ్డివాములో సూదిని వెతుకుతున్నానని' రాం కుమార్‌కు తెలుసు. కాని మరో మార్గంలేదు.

రాజేంద్ర తీసిన ఆ ఫోటో....ఎవరిదో తెలుసుకోవా లంటే అదొక్కటే మార్గం అనిపించింది అతనికి. సహజ మరణం చెందిన వ్యక్తియొక్క కళ్ళలా లేవు అవి. ఆ వ్యక్తి హత్య కావింపబడినా, ఆత్మహత్య చేసుకున్నా అది పోలీసుల రికార్డుల్లో ఎక్కి వుంటుంది.

గోవిందరావు తన పోలీసు అధికారి హోదా వినియో

గించి ఆ ఫోటోయొక్క రెండు కాపీలు సంపాదించాడు. ఒక కాపీ గోవిందరావు దగ్గరే వుంచి, మిగిలినది తను తీసుకున్నాడు రాంకుమార్.

ఇప్పుడు చేయవల్సిన పని: గత సంవత్సర కాలంలో పోలీసుల రికార్డులలో నమోదయిన హతులఫోటోలు పరిశీలించడం. ముఖ్యంగా స్త్రీలవి. ఎందుకంటే ఎక్స్‌పర్టు ఫోటోగ్రాఫర్ యిచ్చిన రిపోర్టు ప్రకారం ఆ కళ్ళు.... స్త్రీవి. అందులో ఇరవై ఐదు సంవత్సరాల లోపు యువతివి అనడానికి చాలా అవకాశా లున్నాయి.

ఆ హతుల ఫోటోలలోని కళ్ళకు, తన దగ్గరున్న కళ్ళకు యేమయినా పోలిక లున్నాయేమో పరిశీలించడం. అఫ్ కోర్స్ యిదంతా ఎక్స్‌పర్టు ఫోటోగ్రాఫర్ చేయాల్సిన పని.

విజయనగరంలో ఆ ఫోటోల వర్క్‌ను గోవిందరావుకు అప్పగించి, తను విశాఖపట్టణం బయలుదేరాడు రాంకుమార్.

ఒక వేళ ఆ యువతి సహజమరణం చెందివుండినట్లయితే, ఆ మరణం పోలీసుల రికార్డులలో లేకుండినట్లయితే తమ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరే అని రాంకుమార్‌కు తెలుసు.

కాని....యీ మార్గంలో తనకు యేదో ఒక 'క్లూ' దొరకక పోదని రాంకుమార్ సిక్త్స్ సెన్స్ చెబుతూంది....

## 4

విశాఖపట్టణం చేరి అప్పటికి ఇరవై నాలుగు గంట లయింది. 'సీ పెరల్' హోటల్‌లోని తన రూమ్‌లో.... కుర్చీని దీర్ఘాలోచనలో మునిగి వున్నాడు రాంకుమార్.

ఒక గంట క్రితమే విజయనగరం నుండి గోవిందరావు మెసేజ్ పంపాడు. విజయనగరం పోలీస్ రికార్డులలో ఆ ఫోటోను పోలినవారెవరూ లేరట. అరగంట క్రితమే విశాఖపట్టణం వన్ టౌన్, టూ టౌన్ పోలీస్ స్టేషన్ల నుండి కూడా మెసేజ్‌లు వచ్చాయి—అదే నెగిటివ్ అన్సర్.

ఇక—ఒక్క త్రీటౌన్ పోలీస్ స్టేషన్ నుండి మాత్రం మెసేజ్ రావల్సి వుంది. అక్కడ నుండి కూడా నెగిటివ్ అన్సర్ వచ్చిందంటే....కథ మళ్ళీ మొదటికి వచ్చినట్టే.

'తను అనవసరంగా అనుమానిస్తున్నానా' అని అనిపించింది ఒక్క క్షణం. కాని రాజేంద్ర కళ్ళలోని కలవరం గుర్తుకువచ్చాక మళ్ళీ ఏదో ఆశ కలిగింది రాంకుమార్‌కు.

ఇంతలో, అతని ఆలోచనలను భంగపరుస్తూ టేబిల్ పైన వున్న టెలిఫోన్ మ్రోగసాగింది. రిసీవర్ అందుకొన్నాడు రాంకుమార్. అది త్రీటౌన్ పోలీస్ స్టేషన్ నుండి వచ్చిన కాల్. త్రీటౌన్ సబ్ ఇన్‌స్పెక్టర్ మాట్లాడుతున్నాడు.

"సర్....ఒక ఫోటోలో కాస్త పోలికలు కన్పించాయి. ఆమె...."

అతని మాటలను మధ్యలోనే కట్ చేశాడు రాంకుమార్.

"నేను బయలుదేరి వస్తున్నాను. మన ఫోటోగ్రాఫర్‌ను అక్కడే ఉండమనండి"—అని చెప్పి రిసీవర్ క్రెడిల్ మీద ఉంచాడు.

'నేరపరిశోధనలో నేరస్తుల గురించిన ఏ వివరాలూ

టెలిఫోనులో మాట్లాడకూడదు' అన్నది తన ట్రెయినింగ్‌లో నేర్చుకున్న ఒక పాఠం. ఆ ఇన్ఫర్ మేషన్‌ను ఎవరయినా ట్రాప్ చేసి ముద్దాయికి అందించినా, అతడు దానికి ప్రత్యామ్నాయం వెతుక్కొని సిద్ధంగా వుంటాడు. సులువుగా తప్పించుకోగలుగుతాడు.

ఐదు నిముషాల తర్వాత హోటల్ 'సీ పెరల్' నుండి ఒక టాక్సీ బయటకు దూసుకుపోయింది. అందులోని వెనుక సీటులో రిలాక్స్‌డ్‌గా కూర్చుని వున్నాడు రాంకుమార్.

## 5

విశాఖ త్రీటౌన్ పోలీస్ స్టేషన్.

సబ్ ఇన్‌స్పెక్టర్ అందించిన ఫైలును చూస్తున్నాడు రాంకుమార్. అతని యెదురుగా త్రీటౌన్ పోలీస్ స్టేషన్ సబ్ ఇన్‌స్పెక్టర్ రమేష్, పోలీస్ ఎక్స్‌పర్ట్ ఫొటోగ్రాఫర్ సన్యాసిరావు కూర్చుని వున్నారు.

ఈ మధ్యే ఆ కేసు క్లోజ్ చేయబడింది. హంతకుడు కూడా అరెస్టు చేయబడ్డాడు. ఇప్పుడు మళ్ళీ ఆ క్లోజ్ చేయబడ్డ కేసును సి.బి.ఐ. ఆఫీసరు రాంకుమార్ తిరగతోడుతున్నందుకు వారికి విసుగ్గా వుంది. కాని, ఆ భావం యేమాత్రం కూడా తమ ముఖాల్లో కన్పించకుండా జాగ్రత్తపడ్డారు వారు.

ఫైలులోని హతురాలి ఫోటోలను చూసిన మరుక్షణం రాంకుమార్‌కు ఆ 'జంటకన్నుల' ఫోటోను చూసినప్పుడు అలాంటి కళ్లనే తను ఎక్కడో చూశానని తనకు ఎందుకనిపించిందో అర్థమయింది. మరణించిన ఆమె శవాన్ని వివిధ కోణాల్లోంచి తీయబడ్డ ఫోటోలన్నీ ఆ ఫైలులో పొందికగా అంటింపబడి వున్నాయి. అయితే రాంకుమార్

చూస్తున్నది ఆ ఫోటోలను కాదు.

మరణించక ముందు తీయబడ్డ హతురాలి 'బస్ట్ ఫోటో'ను. ఆమె హత్య చేయబడినప్పుడు ఆ ఫోటోనే పేపర్‌లో వేశారు. చిలిపిగా నవ్వుతున్న ఆ కళ్ళను చూసే తను 'బ్యూటిఫుల్ ఐస్' అనుకున్నాడు.

"మిస్టర్...." ఎదురుగా కూర్చుని వున్న ఎక్స్‌పర్టు ఫోటోగ్రాఫర్‌ను ఎడ్రస్ చేశాడు రాంకుమార్.

"సన్యాసిరావు....సర్" ఫోటోగ్రాఫర్ గొంతులో నమ్రత.

తన చేతిలోని ఫైలును మూసి సుతారంగా బల్ల మీదకు గిరవాటు వేస్తూ అడిగాడు రాంకుమార్.

"నేను యిచ్చిన ఫోటోలోని కన్నులు ఈమెవే అని మీరు యెలా చెప్పగలరు?"

"సర్! ఏ వ్యక్తి కన్నులూ మరొకరివి పోలివుండవు. కనుబొమ్మల తీరు, కంటిపాప రంగు, ఐమీన్ రెటీనా.... ముఖ్యంగా కంటి గ్రుడ్డు ఆకారం. ఇంకా కంటిరెప్పలు, వాటిమీద వుండే వెంట్రుకలూ యివన్నీ ఒక్కొక్కరికి ఒక్కొక్క విధంగా వుంటాయి" సిన్సియర్‌గా ఎక్స్‌ప్లెయిన్ చేయసాగాడు సన్యాసిరావు.

"అఫ్‌కోర్స్" అవన్నీ మీలాంటి ఎక్స్‌పర్ట్స్ కనిపెట్టగలరనుకోండి. కాని యింకేదో ప్రత్యేకత ఉందనిపిస్తోంది ఈ కళ్ళలో. ఐమీన్ ఒక్కసారి చూస్తే చాలు. మా లాంటివారు కూడా గుర్తుంచుకోదగ్గ ప్రత్యేకత. యేమిటది....?" సన్యాసిరావు మాటలను మధ్యలో కట్ చేస్తూ అడిగాడు రాంకుమార్.

రాంకుమార్ ప్రశ్నకు వెంటనే జవాబివ్వలేదు సన్యాసిరావు. టేబిల్ మీద ఫైలును చేతిలోకి తీసు

కున్నాడు. ఫైలును తెరచి ఆ ఫోటోలవంకే దీక్షగా చూడసాగాడు.

"మీరన్నట్లు ఈ కళ్ళలో నిజంగా ఓ ప్రత్యేకత ఉంది సర్" అన్నాడు.

రాంకుమార్ కుతూహలంగా చూశాడు.

"ఈ కళ్ళల్లో ఒక మత్తువుంది. అంటే 'సెక్సీ ఐస్' అన్నమాట. మగవాళ్ళను సమ్మోహితులను చేసే కళ్ళు" చెప్పాడు.

"మిస్టర్ రమేష్! మనం ఒకసారి హంతురాలి ఇంటికి వెళ్దామా?" కుర్చీలోంచి లేస్తూ అన్నాడు రాంకుమార్. అతని చేతిలో ఆ కేసు ఫైలుంది.

'ఎందుకొచ్చిన తద్దినం?' అని మనసులో అనుకొంటూ అతడిని అనుసరించాడు సబ్ యిన్స్పెక్టర్ రమేష్.

స్టేషన్ ఆవరణలో జీపు సిద్ధంగా ఉంది. వారిద్దరు యెక్కి కూర్చోగానే జీపును స్టార్ట్ చేశాడు డ్రైవర్.

"పెద వాల్తేర్ పోనీ" అన్నాడు రమేష్. అతని గొంతులో యెంత దాచుకున్నా దాగని విసుగు లీలగా ధ్వనించింది.

అతనివంక నవ్వుతూ చూశాడు రాంకుమార్. అతడి చూపులకు యిబ్బందిగా కదులుతూ దిక్కులు చూడసాగాడు రమేష్.

అతని పరిస్థితిని గమనించి తన దృష్టిని మరల్చాడు రాంకుమార్. ఇప్పుడు అతనికళ్ళు అర మోడ్చి వున్నాయి. అయితే అర మోడ్చిన ఆ కన్నుల వెనుక యింతకు క్రితం చదివిన ఆ హత్యకేసు సినిమారీల్లలా తిరగసాగింది. ఆ కేసును మననం చేసుకొంటున్నాడు రాంకుమార్.

హాతురాలి పేరు జయమాల. ఆమె భర్త సత్యం మునిసిపల్ ఆఫీసులో అటెండరుగా పని చేస్తున్నాడు.

జయమాల స్వతహాగా చాలా అందమయినది. దానికి తోడు ఆడది యెలా అలంకరించుకొంటే మరింత ఆకర్షణీయంగా కన్పిస్తుందో జయమాలకు బాగా తెలుసు. అద్దంలో తన అందాన్ని చూస్తూ గడపడమంటే ఆమెకు యెంతో యిష్టం. తన అందాన్ని పొగిడే మగవారంటే మరీ యిష్టం.

జయమాల తండ్రి ఒక స్కూల్ మాస్టరు. జయమాల పుట్టిన తరువాత చాలా సంవత్సరాల వరకూ అతడికి సంతానం కలగలేదు. సుమారు పది సంవత్సరాల తరువాత అంటే నడిమి వయస్సులో ఒక మగపిల్లవాడ్ని కని జయమాల తల్లి మరణించింది. ప్రస్తుతం ఎనిమిదో తరగతి చదువుతున్నాడు ఆ అబ్బాయి. ఉదయం పది గంటలకు తండ్రీ, తమ్ముడూ యిల్లు వదిలితే మరలా తిరిగివచ్చేది చీకటి పడ్డాకే.

ఉదయం పది గంటలకల్లా వంట పూర్తి చేసి వారికి క్యారేజ్ లు కట్టేసి యిచ్చేస్తే ...మరలా సాయంత్రం వరకూ బోలు తీరిక. పెరుగుతున్న వయసు, వయసుతో పాటు శరీరంలో తీర్చుకోలేకపోతున్న వంపులు. అపైన ఒంటరితనం....యివన్నీ ఒక ఎత్తు....వీధిలోని కుర్రకారు ఆకలి చూపులను భరించడం యింకో యెత్తు అయ్యేది జయమాలకు.

జయమాల తండ్రి జాగ్రత్తపరుడు. తన జీతంలో సగానికి పైగా తన కూతురి పెళ్ళికోసం డబ్బు బాంక్ లో వేసేవాడు. ఆర్థికపరంగా అంత జాగ్రత్త తీసుకొన్న అతడు తన కూతురుపట్ల తీసుకోవాల్సిన యింకో ముఖ్య

మైన జాగ్రత్తను వహించాడు. అది....వయసులో వున్న ఒక అందమయిన ఆడపిల్లను ఎవరితోడూ లేకుండా యింటిదగ్గర ఒంటరిగా వదలకూడదన్నది.

తండ్రి మితిమీరిన పొదుపుదనంవల్ల, మిగిలిన ఆడపిల్లలా కాకుండా చాలా సాధారణ జీవితం గడపాల్సి వచ్చింది జయమాలకు. చాలా చిన్న కోరికలు....స్నో, పౌడర్, గోళ్ళ రంగు, పెదాల రంగు లాంటి కాస్మెటిక్స్ కోసం కూడా వయసులో వున్న ఆడపిల్ల కలలు గనాల్సిన పరిస్థితి. సీతాకోకచిలుకల్లా సింగారించుకొని వీధిలోంచి వెళ్తున్న తనతోటి ఆడపిల్లల వంక తెరచిన కిటికీ రెక్క చాటునుండి ఆబగా చూసేది జయమాల.

సరిగ్గా ఆమె యొక్క ఆ బలహీనతపైనే దెబ్బ కొట్టాడు ఆ వీధిలోని లాయర్ గారబ్బాయి మోహన్.

మోహన్ ప్రెజెంట్ చేసిన ఫారిన్ సెంట్స్, స్నో, పౌడర్ టిన్స్ అతని మాటల్లోని చలాకీతనం .... చూసుకుపోయే అతని మనస్తత్వం....జయమాలలో ఒక వివశత్వాన్ని కలిగించాయి. ఆపైన వారికి కావల్సినంత ఏకాంతం.

అప్టరాల్ జయమాల ఈ దేశంలో ఒక సగటు ఆడపిల్ల. అలాంటివారిని వలలో వేసుకోవడం, తను కోరికలు తీర్చుకోవడం మోహన్ లాంటి వాళ్ళకు చాలా సులభం.

జయమాల తండ్రి చెవికి ఈ వార్త చేరేసరికి పరిస్థితి అతడి చేయి జారింది. ఆమె కాలు జారింది. అయితే అతడు స్కూల్ లో పాఠాలను నేర్పడమే కాదు, జీవిత పాఠాలను తానుకూడా నేర్చుకున్న మనిషి.

అందుకే గంతకు తగ్గ బొంతను చూసి తన కూతురుకు గుట్టుచప్పుడు కాకుండా పెళ్ళి చేసేశాడు. అత్తవారింట

అడుగు పెట్టిన మరుక్షణం తన పరిస్థితి మళ్ళీ మొదటికి వచ్చిందని గ్రహించింది జయమాల. తన అతిచిన్న కోరి కలను కైతం తీర్చలేని చిన్న ఉద్యోగి తన భర్త. ఈ ప్రపంచంలో ఆమె అతి యెక్కువ విలువ నిచ్చేది తన అందానికి....తన సౌందర్య పోషణకు.

మనిషి రక్తం చవిచూడనంతవరకూ పెద్దపులి కూడా మనుషులంటే భయపడుతుందట. కాని, ఒక్కసారి నర మాంసాన్ని రుచి చూశాక అది ఇతర జీవాలను ముట్టదు. దానికి ఎక్కడలేని తెగింపూ వస్తుంది. జయమాలలాంటి తెలివిన ఆడవారూ అంతే! 'తప్పు ఒకసారి చేసినా ఒకటే, పదిసార్లు చేసినా ఒకటే' అనుకొంది జయమాల.

అంతే!!—ఆమెకు ఎక్కడలేని తెగింపూ వచ్చేసింది. ఆమె అదృష్టం....అత్తవారింట్లో కూడా ఆమెకు ఒంటరి తనం కలసివచ్చింది. భర్త సత్యం ఉదయం తొమ్మిదికల్లా ఆఫీసుకు వెళ్తే మరలా తిరిగివచ్చేది చీకటిపడ్డాకే. ఆ మాత్రం ఏకాంతం చాలదూ....జయమాలలాంటి ఆడ వారికి ఆ వీధిలోని కుర్రకారును ఒక ఊపు ఊపేందుకు.

జయమాలకు ఒక్క విషయం తృప్తిగా వుంది. ఒకప్పుడు ఈ కుర్రకారు తనను ఆటపట్టించేవారు. ఇప్పుడు తను వాళ్ళను ఆటాడిస్తుంది. అయితే తన విచ్చలవిడి తనానికి తను చాలా పెద్ద ప్రతిఫలాన్ని చెల్లించ బోతూందని జయమాలకు తెలీదు. ఆ ప్రతిఫలం; ఆమె ప్రాణం.

సత్యానికి తన భార్య చెడు తిరుగుళ్ళ గురించి తెలి సింది. అతడు తొందరపడలేదు. తన అనుమానాన్ని ఋజువుతో సహా నిర్ధారణ చేసుకున్నాడు. జయమాల శీలం గురించి తెలిశాక క్షమించడానికి సత్యం....ఆమె

కన్నతండ్రి కాదు. కట్టుకున్నవాడు. తన. భార్యను పరాయి మగవాళ్ళతో అక్రమ సంబంధం వుందని తెలిశాక కూడా సహించడానికో, విడాకులకోసం కోర్టుకు వెళ్ళడానికో అతడు పాశ్చాత్యుడు కాదు.

అతడు .... భారతీయుడు. ప్రాణంకన్నా మానానికే ఎక్కువ విలువనిచ్చే హైందవ నాగరికతను జీర్ణించుకొని పెరిగినవాడు. అందుకే అతడు ఈ సమస్యకు ఒకే ఒక పరిష్కారాన్ని ఎన్నుకున్నాడు.

ఆ పరిష్కారం జయమాల మరణం!!

జయమాల దారుణంగా చంపబడింది. ఆమె పొట్ట పొత్తికడుపు కత్తిపోట్లతో ఛిన్నాభిన్నమై బీభత్సంగా వుంది. ఒకటి, రెండూ కాదు. ఎనిమిది కత్తిపోట్లు.

పోలీసులు వచ్చేసరికి, రక్తసిక్తమయిన దేహంతో, చేతిలో హత్యాయుధంతో భార్య శవం ప్రక్కనే నిలుచుని వున్నాడు సత్యం. అతడు తప్పించుకోవడానికి ఏమాత్రం ప్రయత్నించలేదు. శీలం చెడిన తన భార్యను తనే హత్యచేసినట్టు వాఙ్మూలం యిచ్చాడు సత్యం. పోలీసుల దృష్టిలో ఇటీజ్ ఎక్లియర్ కేస్ ఆఫ్ డెలిబెరేట్ మర్డర్.

తాము వెళ్ళేసరికి జయమాల శవం నగ్నంగా వుండటంచేత, బహుశా ఎవరో ప్రియునితో జయమాల వుండగా ఆమె భర్త సత్యం గదిలో ప్రవేశించి వుంటాడని, భార్యను పరాయి మగవానితో చూసిన ఆవేశంలో సత్యం తన భార్యను హత్యచేసి వుంటాడని- అన్నది పోలీసుల కథనం.

తాను గదిలో ప్రవేశించేముందే పెరటితలుపు తెరచు

కాని ఎవరో పోతున్న సవ్వడి విన్నానని 'సత్యం స్టేట్ మెంట్ యివ్వడంచేత పోలీసుల పని మరింత' తేలికయ్యింది.

తన తరఫున లాయర్‌నుకూడా పెట్టుకోలేదు సత్యం. ప్రాసిక్యూషన్ వారి వాదనకూడా నామమాత్రంగానే నడిచింది. ముద్దాయి తన నేరాన్ని స్వయంగా ఒప్పుకున్నాక యింక ఆ కేసులో పస యేముంది?

భార్యను అంత దారుణంగా హత్యచేసిన సత్యానికి ఇండియన్ పీనల్ కోడ్ 302 సెక్షన్ ప్రకారం 'ఉరిశిక్ష' విధించమని పబ్లిక్ ప్రాసిక్యూటర్ కోరాడు. అయితే— హత్య గావింపబడిన పరిస్థితులను దృష్టిలో వుంచుకొని, ఇది కేవలం ఆవేశంతో చేయబడ్డ హత్యగా భావించి న్యాయస్థానం సత్యానికి యావజ్జీవ కఠిన కారాగార శిక్ష విధించింది.

# 6

పెదవా లేరులోని 'సత్యం' ఇంటిని క్షుణ్ణంగా పరిశీలించాడు రాంకుమార్.

ఒక విశాలమైన వీధిలో కట్టబడ్డ పురాతనమైన పెంకుటిల్లు అది. సత్యం పిత్రార్జితం. చిన్నలోగిలి. బెడ్ రూమ్, డైనింగ్ కమ్ కిచెన్. బెడ్‌రూం నుండి, వంటగదినుండి యింటి పెరడులోనికి మార్గాలున్నాయి.

"హత్య మధ్యాహ్నం ఒంటిగంట ప్రాంతంలో కదూ జరిగిందని డాక్టర్ రిపోర్టు"—యింటిలోనుండి బయటకు వస్తూ అడిగాడు రాంకుమార్.

"యస్ సర్ .... ఒంటిగంటా.... రెండుగంటల మధ్య" రాంకుమార్ వెనుకే అడుగులువేస్తూ నమ్రతగా జవాబిచ్చాడు రమేష్.

